# జాబులు

భారత మహిళాసంఘము, బెజవాడ

చల్లపల్లి రాజాగారి దానము

శ్రీమంతు శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరు గారు వారి పట్టాభిషేకోత్సవసమయమున బెజవాడ 'భారత మహిళామండలి' వారికి వారిచేరువ పఠనాలయమునకు ప్రత్యేకించి పుస్తకములు కొననిమిత్తము వగైరాలో నాల్గువందల రూపాయలు పంపినారు. అందుకు మండలివారు శ్రీవారికి వందనము లర్పించుచున్నారు.

తుర్లపాటి రాజరాజేశ్వరమ్మ,
కోశాధిపురాలు.

---

విచారకరమగు వార్త

గన్నవరం తాలూకా వేమండ గ్రామస్థులున్నూ కమ్మకులజులున్నూ గన్నవరం తాలూకా రైతుసంఘమునకు కొంతకాల ముపాధ్యక్షులుగా నున్నట్టియు రైతుప్రముఖులున్నూ రైతుల విషయమున ఎక్కువ శ్రద్ధతో పనిచేయు చున్నట్టియు పిన్నమనేని వెంకటాచలంగారు వారి 70 వ సంవత్సరమున పరమపదించినారని వినుట కెంతయు విచారము. వారి మరణవార్త ఆంధ్ర రైతులోకమునకు మిక్కిలి దుఃఖకరము. వారి ఆత్మకు శాంతి కలుగుగాక. వారి కుటుంబమునకు సానుతాపమును దెల్పుచున్నాను.

జాలాది అంజనేయచౌదరి.

---

హిందీప్రేమమండలి – బెజవాడ

ఈనెల 19 తేది ఆదివారం సాయంత్రము 5 గంటలకు రామమోహన గ్రంథాలయ భవనమున పైమండలి సభ్యుల సాధారణసమావేశము జరుగును. ఇకనుండి ప్రతి ఆదివారము మండలి సభ్యుల సమావేశము జరుగుచుండగలదు. 19 తేదీ సభయందు ఏప్రియల్ మాసములో బెజవాడలో జరుగనున్న హిందీ మహాసభ ఏర్పాట్లను గూర్చియు హిందీలో ఒక నాటకమును తయారుచేయుటను గురించియు, యింకా యితరవిషయములు యోచింపబడునుగాన సభ్యులందరు దయచేయ ప్రార్థితులు.

పి. కామేశ్వరసోమయాజి,
కార్యదర్శి.

---

సహకార బోధనాతరగతులు

ఏలూరు తాలూకా వసంతవాడలో లోకల్ కోఆపరేటివు యూనియనువారి యాజమాన్యమున సంఘ పంచాయతీదార్లకును, గుమస్తాలుగా నిల్చువారలకును, సంఘముల నడుపు క్రమము లెక్కలు వగైరాలు వ్రాయుపద్ధతులు మొదలగు అంశములు నేర్పుటకు గాను ది 17-1-30 తేదీన కలపర్రు గ్రామములో సహకార బోధనాతరగతులు మ. రా. శ్రీ. ద్రోణంరాజు నరసింహం పంతులుగారి యాజమాన్యమున ప్రారంభింపబడును. కాన సంఘ పంచాయతీదార్లును, గుమస్తాలుగా నిల్చు అభ్యర్థులును హాజరగుటకు దయచేయ ప్రార్థించుచున్నాను. ప్రతినెలలో యీ తరగతులు జరుగును. సంవత్సరాంతమునందు పరీక్షలు జరిపి ఉత్తీర్ణులగువారికి యోగ్యతాపత్రము లొసగబడును.

సామవేదం సత్యనారాయణమూర్తి,
కక్కటరీ.

---



# శ్రీత్యాగరాజ సంగీత విద్వత్సమాజమువారు

స్వామివారి 83-వ వార్షిక మహోత్సవమును జరిపెదరు

---

1930 సంవత్సరం జనవరినెల 19 వ తేదీ ఆదివారము నాడు శ్రీ త్యాగరాజస్వామివారి ఆరాధనమహోత్సవము చెన్నపురియందలి మయిలాపూరులో పైసమాజమువారిచే వైభవముగా జరుపబడును.

ఈ యుత్సవము 17వ తారీఖునకే యారంభమై 3 రోజులు జరుగును. 17, 18 తేదీలలో సాయంకాలము 3 ఘంటల మొదలు 7 ఘంటలవరకు సంగీత విద్వాంసులచే పాటకచ్చేరీలు జరుపబడును. రాత్రి 8 మొదలు 11 వరకు శ్రీ త్యాగరాజస్వామి వారి జీవితమును గురించియు, యితరవిషయములను గురించియు హరికథాకాలక్షేపములు జరుగును. 19 వ తేదీ యుదయము 8 ఘంటలమొదలు 12 ఘంటలవరకు భజనయు, సాయంకాలము 6-30 ఘంటలపైని యూరేగింపును జరుగును. 17, 18 తేదీలను పాటకచ్చేరీలును, హరికథాకాలక్షేపములును మైలాపూరు తూర్పుమాడవీథికి సమీపమున సుందరేశ్వరహాలులో జరుగును.

మహాజనులందరును మాకు సహాయముచేయ ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
విద్వాన్ టైగర్ వరదాచారి
(అధ్యక్షులు)
వీణ సుబ్రహ్మణ్య శాస్త్రి,
ఫిడేల్ సుందరమయ్యర్.
(కార్యదర్శులు)

## శ్రీశైలయాత్ర

### పెద్దచెరువు సత్రము

శ్రీశైల మాంధ్రదేశమునందు పురాతనమైన సుప్రసిద్ధ క్షేత్రము. శ్రీశైలయాత్రను చేయుటకు ప్రజలు అరణ్యముల మధ్యను ప్రయాణము చేయవలసిన విషయము యాత్రను చేసిన వారలకు విదితము. అరణ్యమధ్యమునందు యాత్రికులు అన్నము నీరు లేకయ చాల శ్రమపడుచుందురు. అట్టి శ్రమను కొంతవరకైనను నివారించుటకు శ్రీశైలమునకు దక్షిణద్వారమార్గమునందున్న పెద్దచెరువు దగ్గరను బ్రహ్మశ్రీ గాడేపల్లి అప్పయ్యశాస్త్రి గారును వారి కోడలు సీతమ్మగారును అన్నసత్రమును పెట్టి యాత్రికులకు సకలోపచారములను చేయుచున్నారు. పదిమైళ్లు నడచి 12 గంటలకు యాత్రికులు పెద్దచెరువు చేరునప్పటికి అలసి పోవుదురు. వారికి పట్టెడన్నమును చెంబెడు నీళ్లను ఇచ్చెడి వారు నిజముగను పుణ్యాత్ములు. ఆకలిచే మలమలమాడుచు వచ్చినవారు శ్రీమంతులైనను అరణ్యమధ్యమునను చేయగల దేమియును కనపడదు. అట్టిస్థితిలోను అన్నదానము చేయువారి పత్నిప్రయత్నములకు ధర్మపరాయణులైన పుణ్యాత్ములు యథాశక్తిని సహాయముచేసి అన్నదానపుణ్యమును గట్టుకొనుట పరమార్థము. సహాయము చేయదలచిన ధర్మాత్ములు క్రింది చిరునామకు వారి సహాయమును పంపుటకు వేడుచున్నాము.

గాడేపల్లి - అప్పయ్యశాస్త్రి,
ఆత్మకూరుపోష్టు, కర్నూలుజిల్లా.



## కాంగ్రెసు నిర్ణయము ననుసరించినవారు

—:o—

కడచిన ఎన్నికలలో ఆంధ్ర దేశమున కాంగ్రెసు అభ్యర్థులుగ నిలిచి గెలిచినవారిలో ఈ దిగువ పేర్కొనబడినవారు లాహోరు కాంగ్రెసు నిర్ణయము ననుసరించి శాసనసభలలో తమ సభ్యత్వములకు రాజీనామాలను పంపియున్నారు.

స్టేటు కౌన్సిలు

1. వేమవరపు రామదాసుపంతులుగారు

భారతశాసనసభ

2. యస్. శ్రీనివాసఅయ్యంగారు
3. వి వి. జోగయ్యగారు
4. బి పెరుమాళునాయుడుగారు
5. టం. ప్రకాశంగారు
6. సి. దొరస్వామిఅయ్యంగారు

మదరాసు శాసనసభ

7. స్వామి వెంకటాచలంశెట్టిగారు
8. చావలి రామసోమయాజులుగారు
9. సి. ఓబిరెడ్డిగారు
10. మోతే నారాయణరావుగారు
11. కోటిరెడ్డిగారు
12. అ. కాళేశ్వరరావుగారు

రిపెటిషన్టు విచారణ సంఘ సభ్యులగు బిక్కని వెంకటరత్నం, కె వి. ఆర్. స్వామినాయుడుగార్లు 15 వ తేదిన నివేదికయందు సంతకము చేసి తమ శాసనసభ్యత్వములకు రాజీనామా ఇచ్చునట్లుగ ప్రకటించియున్నారు.

ఇంకను రాజీనామ ఇవ్వవలసినవారు

1. విశ్వనాథదాసుగారు
2. వ. కామేశ్వరరావు నాయుడుగారు
3. గా. సి. వి, యస్. నరసింహారాజుగారు
4. పి. సి. వెంకటపతిరాజుగారు
5. దంతు నారాయణరాజుగారు
6. పి. సి. ఆంజనేయులుగారు
7. ఎ. పరశురామరావుగారు
8. జి. హరిసర్వోత్తమరావుగారు
9. పి. శివరావుగారు
10. సి. యస్. గోవిందరాజులు మొదలిగారు
11. డాక్టరు. బి. యస్. మల్లయ్యగారు.

# ఆంధ్రపత్రిక

## సారస్వతానుబంధము

చెన్నపట్టణము 1930-వ సం॥ జనవరి నెల 16-వ తేది గురువారము

11


## ఉడుత

[మద్దూరి సాంబయ్యగారు]

మ. నడలందప్రతిమానలాఘవమ్ము, క
ర్ణద్వంద్వమందుఙ్గగనుం
గడుజాగ్రత్త; నిరీక్షణంబులను దై
క్ష్ణ్యవ్యగ్రభావంబులున్
ఒకచెల్లన్ జుఱుకుందనంబు, పనులం
దొయ్యారమున్ గల్గు నో
యుడుతా! నిన్గనుచుండ డెందమున నెం
తో సంతసం బయ్యెడిన్.

మ. కడునెత్తౌ ధరణీరుహాగ్రతను శా
ఖల్ దోఁకయే తూకపుం
గడగా భీకరమారుతాహతులకున్
జంకింతయున్ లేక, చూ
చెడువారల్ వెఱగంద, హాస్యరసపున్
జేష్టల్ ప్రదర్శించి, యె
క్కుడు మోదంబు ఘటిల్లఁ జేసెదవు, చి
క్రోడంబ! వర్ధిల్లుమా.

గీ. కమ్మతెమ్మెరచెలు లూడిగంపుఁగత్తె
లగుచు లేఁగొమ్మతూఁగుటుయ్యాలల నూప
హాయిఁ గూర్చుండి ఫలహారమారగింతు
వుడుత! నీకంటె భోగి యెవ్వఁ డిలఁగలఁడు?

సీ. జననమా? శ్రీరామచంద్రహస్తస్పర్శ
భాగ్య మందిన పూతవంశమందు,
సహవాసమా? సదాసాధుసన్మునిపరోప
కృతిపరఫలవనస్పతులతోడ
ఆహారమా? సాత్త్వికాప్తిఁ గూర్చెడుస్వాదు
ఫలరసజలమృదు పల్లవములు,
వృత్తియా? నిత్యసంతృప్తి నాత్మానంద
విమలమౌ నిరపాయ విహరణంబు.
ధాత్రి నీ కంటె నింకఁ బవిత్రు లెవరు?
తొలుతటిమునీంద్రు లిట్టివారలెకదా త
లంప నీజన్మమే సఫలతను గాంచు
నుడుత! నీనెయ్యమును గోరుచుంటి రమ్ము.

మ. నయనానందముగాఁ జరించు నినుఁ గా
నక లేక దుర్బుద్ధి ని
ర్దయులై రాలను రువ్వఁగన్ గడలచే
తన్ మోదగన్ వాగురా
చయమందున్ బడవేయఁబూచెదరు హిం
సామోదులో మానవుల్
రయ మొప్పన్ నినుఁ బ్రోచుఁ గాత మ
పు డారాముండు చిక్రోడమా

## అంధప్రణయము

(షేక్స్పియరు మహాకవినుండి)

గీ॥ అయ్యయో! ప్రణయమా! దృష్టి నంతమాపి
మాంద్య మొనరించితివి; నీదుమహిమ పొగడ
హరిహరబ్రహ్మలకుఁగూడ నలవియగునె!
దృష్టిమాయకయుండిన, దృష్టవస్తు
తత్త్వనిర్ణయక్రమ మేల దప్పఁజూచు?
ఏను ప్రేమించునది హృద్య మైనయెడల,
కా దటంచు వచింప లోకమున కేల?
హృద్యమే కానిచోఁ దర్క మేల? జగతి
నక్షులుండియుఁ బ్రణయమాత్రావశిష్టుఁ
డంధుఁ డంచు వచింపంగ నర్హ మౌను.
అగపడు ప్రపంచ మంధకారావృతముగఁ,
బ్రణయదేవతకై నిరీక్షణము సల్పి,
యశ్రుజలపూరితంబులౌ నక్షులకును.
జలదపటలసమావృతజలజహితుఁడు
కాంతిఁ దక్కినమాడ్కి; నేకన్ను లుండి,
కాంచఁ గాఁజాల జగ మశ్రుకణము లూర.
అశ్రుజలపూరితంబులౌ నక్షులకును,
నీదుతప్పులు గానంగ రాదటంచు,
నశ్రుకణముల నిట్లు న న్నంధుఁ జేయు
దహహ! ప్రణయమ! ని న్నెవ్వ రడుగరారె!

(మూశి జగన్నాథం.)

## అర్చన

[కందుకూరి రామభద్రరావుగారు]

దేవి! నీపాదపద్మముల్ దివ్యసూన
రాజి నర్చించు కాంక్షలు ప్రాలుఁగాని
తగిన సుమములకొఱకయి తడవుకొనుటఁ
గాలమంతయుఁ జనుచున్న దేలనమ్మ?—
శ్రావ్యగీతాల గీర్తింప నరిగ వీణ
తంత్రులు లగింపఁ దెగియెడి తల్లి యేమొ
కృతియె పడదయ్యె కంఠము చెడుట యయ్యె,
వినుగు జనియించె, చాలించు వేళ యయ్యె.
భువనమోహనమైన రూపు గని రెప్ప
వాల్పకే చూచు కాంక్ష సంపదల నీన
కనులు మూతవడు నిదుర క్రమ్ముకొనును,
కాల మేగును తెలి వెంది కనను నిన్ను
భావశూన్యుఁడనై బొమ్మ భాతినున్న
నన్నుఁ జూచి పిలిచెదు చేసన్న చేత
నికటమున కేగు యత్నంబు నిండునంత
వేళ తప్పునో నీ వేలే వెడలిపోదు?

## ఆశాభంగము

[పాణంగిపల్లి వీరభద్రరావుగారు]

(బ్యాచులర్ ఆఫ్ ఆర్ట్సుకోర్సు)

లలిత మాధుర్య కోకిలారవము వినుచు;
చెలువుఁ గొలిపెడి రేయెండ వెలుఁగులందు;
చెలువు గొలుపొందు సైకత శ్రేణులందు—
ఎన్నఁడో మదిఁ బాడఁగా నెంచినట్టి,
పాట నింకను పాడనే పాడలేదు:
వీణెతంత్రుల సరిఁజేయు వేడ్కతోన్నె,
గాలమెల్లను గడచె నిష్కారణముగ!!!

## శ్రీ లోకమాన్యస్తవరాజమ్

[సువర్ల విశ్వనాథశాస్త్రిగారు]

శ్లో॥ శ్రీమత్కాంచన చారుదేహకలితం చాంగ్లేయభాషాగురుం
భూపాలైరపి వందితం ద్విజకులజ్ఞానాధికం జ్ఞానినాం
నానాశాస్త్రపురాణశాస్త్రలలితం ధీశౌర్యవిద్యాన్వితం
వందేహం గురులోకవందనపటుం శ్రీబాలగంగాధరం॥

శ్లో॥ యద్వాచామృతపూరపూర్ణ ముదితం గీతారహస్యం శివం
యద్బోధాచ్ఛివమేదినీ నయకరై స్సంశాలినీ సర్వదా
యత్కారాగృహసేవనం చ సతతం లోకస్య ధైర్యోద్భవం
తం ధీరం పురుషం నమామి సతతం శ్రీబాలగంగాధరం॥

శ్లో॥ సర్వథాచ తపోనిష్ఠం। క్రోధామం భావవర్జితం।
ఆరాధనాయ లోకస్య। బంధనే చాపి తుష్టినం॥

శ్లో॥ సర్వేషు మర్త్యేషు సమానభావం
దిగంతవిశ్రాంతయశోవిరాజం
నిర్వాణకాలేప్యతినైజతేజః
మహాత్మదేహం భువి లోకమాన్యం॥

వందే మాతరమ్.

# మిలను స్వాతంత్ర్యసంరంభము

(హిందీ పద్యకావ్యమున కనువాదము)

[కూచిభొట్ల హనుమంతరావుగారు]

రాత్రి రెండుజాము లైంది. కన్ను పొడుచుకున్నా కాన రాని చీకటి ప్రపంచం అంతా వ్యాపించిపోయింది. మింట తారాగణంమాత్రం మిణుకుమిణుకు మంటోంది. చరాచరములు నిద్రావస్థలో మునిగిపోవడంచేత, ప్రకృతిఅంతా మౌనవ్రతంపట్టిందా యున్నట్లుగా ఉంది. కాని మిలను పట్టణానికి దక్షిణభాగంలో యున్న కారణవియందు మాత్రం, లతావినిర్మితమైన ఒక కుటీరం నుంచి, రోదోయులుకుడు వినవస్తోంది. అట్టి యేకాంతప్రదేశమందు నిర్మింపబడిన, యా శాంతినికేతనమం దిద్దరు ప్రేమీయులు, నిద్రక స్మరుగక, యేదియో భయావక విషయాన్ని గురించి తలలో చిస్తున్నారు. అబలయగు విజయ, ఆనందకుమారుని, బాహుమూలమందు ఫాలభాగాన్ని జేర్చుకుని "నాథా! అణుమాత్రమైనా నే నీవిరహవ్యథను సహించలేను. పక్షికునిచే వియోగాధీనం చేయబడ్డకపోతినివలె నన్ను మాత్రం యీ నిర్జరారణ్యంలో ఒంటిగా విడచిపోవద్దు. నా దేహప్రాణము లున్నంత వరకు, యిటమండి మిమ్మల నణుమాత్రమైనా కదలనీయను అంటూ యాతనికంఠసీమను గట్టిగా కౌగలించుకుంది.

విజయ పొందుచున్న పరితాపన్ని చూచి ఆనందకుమారుడు భరించలేక పోయాడు. అతనిహృదయం నీరయిపోయింది. ధైర్యం చలించింది. విజయను ఒక్కమారు గట్టిగా కవుగలించుకుని, భయంవల్ల యెఱ్ఱబారియున్న చెక్కుటద్దాలను ముద్దెట్టుకుంటూ, కొంతసేపు తన్మయావస్థలో మునిగిపోయాడు. ఆహా! ప్రేమకు యెట్టిప్రభావం ఉంది. వియోగావస్థలో దానికి మించిన దుఃఖప్రదమైంది ప్రపంచములో మరొకవస్తువు లేదు.

ఏలాగైనా నచ్చజెప్పి వెళ్ళా లనుకున్నాడు విజయుకు. దేశంయొక్క పరిస్థితులను గురించియూ, దేశంయొక్క సందిగ్ధావస్థను గురించియూ విపులంగా బోధించాడు. పరిపాలకుల స్వార్థపరత్వం, వా రాచరిస్తోన్నదుండగాలు, వారుచేస్తూన్న ప్రజాపీడన, వారు దేశానికి కల్పించిన దారిద్ర్యం, ప్రజాసమూహంలో వ్యాపించిపోయిన అసంతుష్టి, మొదలయినవాటిని గురించి తేటతెల్లంగాచెప్పాడు. ఎంత చెప్పిన విజయమాత్రమాతని విడిచి యుండుట కేమాత్రం ఒప్పుకోవడంలా. ఏంచేస్తాడు. సంరంభం సన్నాహంలోకి స్త్రీలను తీసుకు వెళ్ళడం యేలాగ యని విచారించాడు. ఒకవైపున తనను మనసారా ప్రేమించియున్న కాంతాబలాత్కారం – మరోవైపున యచలమయిన స్వాతంత్ర్య సంరంభేచ్ఛ. ఏ. చెయ్యడానికి యతనికి తోచలా నీటిలోనుంచి తీసిన చేపలాగ కొట్టుకుంటూన్నాడు. విజయ నేలాగైనా యొప్పించి, స్వాతంత్ర్యసంరంభములో చేరి, వైరివర్గమును జెండాడి, శృంఖలాబద్ధయై యున్న దేశమాతకు స్వేచ్ఛను సంపాదించి తరించవలె నని గంపెడంత యాశ పెట్టుకున్నాడు. కాని విజయ మొండిపట్టు పట్టింది. అలా తనకోర్కె నిరాకరించిన, నిమ్న సేవనంచేత యిహలోకాన్ని వదలేయుడానికి త్రికరణశుద్ధిగా నిశ్చయించుకొన్నా నని చెప్పేసింది. ఆడినమాట తప్పని దొలచేతను, పట్టినపట్టు వదలని దొలచేతను యామె మనోనిశ్చయాన్ని విని యదలి పోయినాడు. ఇక యేం చేస్తాడు? పురుషవేషంలో తన్ను యనుసరించవలసిందని సెలవిచ్చాడు.

విజయదుఃఖ మంతయు త్రుటికాలంలో సంతోషంగా మారిపోయింది. దీనవదనం షోడశకళాపరిపూర్ణం అయింది. దేశముక్తికై పాటు పడడానికి తనకు గూడా యవకాశం కల్గించినందుకు పరమేశ్వరునకు కృతజ్ఞతాపూర్వక వందనాలు శతసహస్రం సమర్పించింది. పతిభక్తి, దేశముక్తికొరకు ముఖం మీదికి మూగుతూ యున్న ముంగురులను తుమ్మెద రెక్కలవలె నల్లనై పిరుదుల నంటుతూయున్న కేశరాజములను సౌందర్యవిహీన మని యైనా యెంచక కత్తిరించేసింది. పురుషవేషం ధరించింది. తనను తానే గుర్తించ లేనట్లుగా మారిపోయింది. తన వేషాన్ని జూచుకుని తానే ఆశ్చర్య పడ్డది. వినయవృత్తితో భర్తచెంతకు జేరి, పాదములకు ప్రణమిల్లి నిలబడ్డది. ఆనందకుమారుడు ముద్దులు మూటకట్టుతోన్న తన ప్రియురాలి నూతన వేషమును చూచి చకితుడై, యామె తెల్వితేటలకు లోలోన సంతసిస్తూ దగ్గరకు తీసుకున్నాడు. ఆహా! స్త్రీ లెంతకార్యశూరులు! ఎంతటి ధైర్యశాలినులు!

ప్రేమీయులు ప్రయాణ సన్నద్ధులైనారు. కాని అచ్చటి లతావితానములను పశుపక్ష్యాదులను సుఖదాయకమగు కుటీరమును వదలి వెళ్ళడానికి కాళ్ళు సాగలా. నిర్మానుష్యమైన యరణ్యంలో హాయిగా కాలం గడుపుతూ యున్న వారలకు విషయవాసనలతో నిండి ద్వేషకపటములకు పుట్టినిల్లయి నరకసమానంగా యుండు యీ ప్రపంచంలోకి కాలు పెట్టాలంటే వారి కోవిధమైన జంకు కలిగింది. కాని దేశసేవాధురంధరులు ధైర్యమూర్తులు లోకకల్యాణంకొరకు స్వార్థత్యాగులై సర్వసుఖములను త్యజించి బయలుదేరారు. మెల్లమెల్లగా యడుగులిడుచు మధ్యమధ్య చిరపరిచితములు లతావితానములను, వృక్షరాజములను విహంగకురంగములను జూస్తూ, వాటి వియోగాన్ని భరించలేక గడియ గడియకు దీర్ఘనిశ్వాసముల విడుస్తూ అటవీమార్గాన్ని బట్టారు.

దేశభక్త్యుత్సాహపూరితులైనవా రిద్దరికి కూడా మార్గాయాస మేమాత్రం కలగలా. రాత్రి గడిచిపోయింది. ఉషాదేవి బంగారురంగు చీర ధరించి తన సహజ సౌందర్య కిరణాలచే తంద్రావస్థలో మునిగియున్న సర్వభూతకోటిని తట్టి మేల్కొలుపుతూంది. అట్టి సమయంలో ప్రణయీ యుగళము నదీతీరానికి వచ్చారు. నదీ జలతరంగ డోలికయం దూగుచున్న సూర్య భగవానునికి, యాత్మ ప్రదక్షిణ నమస్కారము లర్పించి, తమ కార్యము సానుకూలం చేయవలసినదిగా ప్రార్థన సల్పారు. సమీపమున నే యొక వృక్షమునకు బంధింపబడియున్న నాకను వదలించి. 'దేశమాతకు జై' అని కేకలువేయుచు సంతోష స్వాంతులై దాని నధిరోహించారు.

నావ ప్రవాహంలో పరుగిడుతోంది. అపారమైన జలరాశి గంభీరంగా ప్రవహిస్తోంది. టెంకాయనీరు మాదిరిగా జలము నిర్మలంగా ఉంది. దేశముక్తికి పలయు సహాయముల గురించి చర్చించుకుంటూ, నదిలో యందందు యెగురుచున్న జలచరముల జూచి పరమేశ్వరుని సృష్టి చాతుర్యమును కొనియాడుతూ, నిర్విచారముగా జలరాశిని తరించి పోతూన్నారు. కొంత సేపటికి నావ నదీమధ్యమును చేరింది.

చూస్తూండగానే యాకాశమంతా కారుమబ్బులు క్రమ్మినయి. ఘోరమైన యురుములు మెరుపులు బయలుదేరినయి. సూర్య భగవానుడు మేఘముల చాటునయుండి పోవడంచేత పట్టపగలే చీకట్లు క్రమ్మిపోయినయి. ప్రకృతి అంతా అల్లకల్లోలమైంది. గాలి తాకుడుచేత చెట్లు చేమలు కుంకుడు శబ్దంతోకూడా కూలిపోతూన్నయి. వాటి పెళపెళా రావములు భూనభోంతరాళములను కంపింప చేస్తూన్నయి. మూసలధారగా వర్షించడం మొదలెట్టింది. అల్లకల్లోలంగా యున్న తరంగాలచేత నావ యిటుఅటు కొట్టుకో సాగింది. ఇప్పుడు మునిగిపోతుందా అప్పుడు మునిగిపోతుందా అన్నట్లుగా ఉంది. విజయానందకుమారులు ప్రాణములను యరచేతిలో పట్టుకొని నిరాధారులై, అసహాయులై, భౌతిక శరీరాలమీద యాశ వదలుకొని, క్రోధఘూర్ణితమైన ప్రకృతుని వీక్షించలేక, యొకరినొకరు కౌగలించుకుని, కండ్లు మూసుకున్నారు. అంతే పాపం! నావ నదీగర్భంలో మునిగిపోయింది.

ఇంతలో గాలి యడగిపోయింది. వర్షం ఆగిపోయింది. ఆకాశం నిర్మలంఅయింది. ప్రకృతి అంతానిశ్చబ్దత వహించింది. దేవతలు యారిపోయిన దీపాన్ని వెలిగించుకున్నారేమో అన్నట్లుగా సూర్యభగవానుడు ఆకాశంమీద అగుపడ్డాడు. చరాచరములకు స్థైర్యం కలిగింది.

(2)

సూర్యోదయం అయింది. బంగారంగమున్న యాతని కిరణములధాటికి యోర్వలేక అంధకారము చెట్లయొక్క ఆకులచాటున దాక్కుంది. ఆనదీతీరమున శాంతమూర్తియగు నొక మునీశ్వరుడు స్నానసంధ్యాదికృత్యములు నిర్వర్తించుకుని, పాత్రను జలముతో పూరింపుకొనుచు, తనవైపునకే కొట్టుకువచ్చుచున్న ఒక శవమును చూచాడు. తపోధనుని హృదయమందు జాలి కలిగింది. వెంటనే యా కళేబరమును బయటికిలాగి లాచాడు. పురుషవేషములో నున్న నారీరత్నమును చూచి నిర్విణ్ణుడైనాడు. ముఖము పరిశీలించిచూచి శవకళ పూర్తిగా తరుగలేదని కనిపెట్టాడు. ప్రాణమున్న దేమోయని శంకించి సమీపమునయున్న తన కుటీరంలోనికి తెచ్చి సర్వోపచారాలు చేశాడు. కొంతసేపటికి చైతన్యం కలిగింది. క్రమంగాలేచి కూర్చున్నది. ఇటునటుచూచి యెదుటనున్న మునిశ్రేష్ఠునకు నమస్కారము చేసి అయ్యా! నాభర్త యెక్కడ? నేనిప్పు డెచ్చటనున్నాను? మేమిద్దరము జలరాశియందు మునిగిపోయినాము. దయచేసి నా పతిజాడ యేమైనను దెలిసిన వెంటనే వినిపింపవలసినదని, సద్గుణగరిష్ఠుడగు నా మునిశ్రేష్ఠుని పాదములుపట్టుకొని ఘోరున విలపించింది. మునీశ్వరు డామెచారిత్రము విని యాశ్చర్యపడి పోయాడు. రెండవకేవ మెచ్చటనైనా శవబడునేమో యని బయలుదేరుచూ, తిరిగి తాను వచ్చువరకు నిర్భయమైన తన యాశ్రమమువందే కూర్చునియుండమని, నామెతో చెప్పి, నదీతీరము ననుసరించి బయలుదేరాడు.

ఆ కుటీరంలో ఒక్కక్షణమైనా కూర్చోలేకపోయింది విజయ. విరహవ్యథవల్ల మనస్సంతా వ్యాకులపడిపోయింది. ఇంటూటువచ్చి యచ్చటి శృంగారమును కళ్ళారా చూచింది. కాని ప్రియదర్శనాభిలాషాపూరితములగు నామె కన్నులకు ప్రకృతియొక్క శృంగారమంతయు కళావిహీనంగా తోచింది. ఆహా! ప్రేమ యెట్టిప్రభావశాలియో, యెట్టి శక్తిసంపన్నురాలో గాని, నిద్రావస్థయందు జాగ్రతయు, జాగ్రతావస్థయందు నిద్రను కలుగజేస్తుంది. ప్రేమాంధకారము కన్నులగప్పినప్పుడు, పిపీలికాది బ్రహ్మపర్యంతం గల ప్రాణికోటులు నిద్రాహారములు గూడ త్యజించేస్తూన్నయి. ప్రేమ నామమునకి ఒక్కటిగా యగుపించినను, ప్రభావంమాత్రం ద్వివిధంగా ఉంది. సంయోగకాలమం దమితానందమును, వియోగకాలమందతి విచారమును కలుగజేస్తుంది. సుఖదుఃఖాలకు, సంయోగ వియోగాలకు పాటుపట్టగునది యీ ప్రేమయే.

తీరమును సమీపించింది. అందు ప్రవహిస్తోన్న గంభీరమైన జలరాశిని చూచింది. ఇద్దరుకలసి నావలో ప్రయాణంచేస్తోన్నప్పటి సంగతి జ్ఞాపకాని కొచ్చింది. మనస్సు నిలుపుకోలేక, నాథుడులేని జీవితం వ్యర్థంఅనుకుంటూ తిరిగి నీటిలో దిగజారింది. ఇంతలోకే తిరిగి స్మృతికలిగింది. ఉరకేయిలా ప్రాణత్యాగం చేసుకోవడం కంటె, పతియొక్క మనోభిలాషను పూర్తిచేయడం పతికి పరమధర్మం యని విచారించింది. వెంటనే నీటినుంచి బయటికి వచ్చింది. ఎవరో తన్ను బిలచినట్లు ధ్వని వినబడడంవల్ల సర్వమును మరచి మునీశ్వరుడేమో, పతిజాడ యేమైనను తెలిసికొనివచ్చినేమో, యని ఆశ్రమంవైపు పరుగెత్తింది. ఇంకను యున్మత్తావస్థ వదలలేదు గాబోలు. దారి తెన్ను తెలియక పొదల్లలో పడుతూలేస్తూ, ప్రియా ప్రాణేశా ఆనందకుమారా! యని యరచుచు ఘోరారణ్యంలో చాలాదూరం వెళ్లిపోయింది. ఎటుచూచినా విశాలమైన వృక్షములు భయంకరములగు క్రూరమృగముల గర్జనములు కంటకమయములగు పొదలు చెవులు చిల్లులు పడునట్లు ధ్వనించు కీచురాళ్ళు పడగలెత్తుక నిటునటు పారాడు దుష్టసర్పములు. అబల యధైర్యపడిపోయింది. విచారిస్తూ చేయునదిలేక యొక వృక్షచ్ఛాయను కూర్చుంది.

(3)

కొంచందూరం వెళ్లేసరికి మునియొక్క మనోభిలాష పూర్తి అయింది. ప్రవాహంలో ఒక యువకుని శరీరం కొట్టుకపోతున్నట్లు గ్రహించాడు వెంటనే నీటిలోనికి దిగి దానిని ఒడ్డుకు చేర్చాడు. తగిన యుపచారాలన్నీ చేశాడు దేహంలో వాయు సంచారం కలిగింది. తన యాశ్రమములోనికి తెచ్చి యగ్నిగుండము ప్రక్కన పరుండబెట్టాడు.

ఇటునటు ఆశ్రమం అంతా కలయజూచాడు. కాని విజయ యేదీ! కుటీరం కలియపలయంతయు వెతికాడు. కాని నిష్ఫలం అయింది. ఎలుగెత్తి పిల్చారు. జవాబులేదు. ఎచ్చట వెదకినను విజయ కానరాలా.

శరీరం కొంచం వెచ్చబడేసరికి స్మృతి కలిగింది. యానందకుమారునకు అతని విశాలమగు వక్షస్థలమును, ఉన్నత భుజములను, అతిసుందరమై అతి గంభీరమై సాత్త్వ భావం వెలిబుచ్చుతూన్న యాతని ముఖమండలమును వీక్షించి ముగ్ధుడైపోయాడు. పదేపదే యాతని వంకచూస్తూ దీర్ఘనిశ్వాసముల బుచ్చుతూ మనస్సునందేదో విచారించుకుంటూన్నాడు. ఇట్టి పురుషశ్రేష్ఠుడు దేశసేవాతత్పరుడైయెనచో ఒక్క త్రుటికాలంలో తప్పక దేశమంతయు దాస్యవిముక్తి కాగలదని యనుకుంటూయుండునంతలో స్వప్నవశమున యువకుడు ప్రలాపించడం మొదలెట్టాడు. విజయా ప్రేమరూపిణీ, విజయా నీవు నేనెక్కడా స్వదేశసేవయెక్కడా యని అడుగుచుండెడి దానవుగాదా కాని విజయా దేశసేవయందు నీవు నాకు తోడునీడయై నిలువబడినచో నాకు నీకంటె ప్రేమించదగినవారు ప్రపంచమున మరెవ్వరులేరు అని సంభాషించి యూరకున్నాడు. దేశభక్తిమయవాక్యములను స్వప్నావస్థయందును గూడ మరువజాలని యట్టివారుని చూచేసరికి మునీశ్వరుని ముఖకమలం వికసించింది. ఆపాదమస్తకం రోమాంచితమైంది. ఇట్టి దేశసేవాతత్పరుని, సేవించు నవకాశం కలుగజేసినందులకు చేతులు జోడించి పరమేశ్వరునకు నమస్కారం చేశాడు.

యువకుని శరీరంలో చైతన్యంకలిగింది. మెల్లమెల్లగా లేచి కూర్చున్నాడు. యెదుట సాక్షాత్కరించియున్న మునిశ్రేష్ఠునకు ప్రణామ మాచరించాడు తానున్నది యెక్కడ ఋషి యాశ్రమంయనియు తన్ను రక్షించిన మహానుభావు డా తాపసపుంగవుడేయనియు తెలుసుకున్నాడు. మునియొక్క యాజ్ఞానుసారంగా తన చరిత్రను యిలాగా చెప్పడం మొదలెట్టాడు.

అయ్యా నా తండ్రి మిలను నగరవాసి. అయన పట్టణమంతటికి గొప్ప భాగ్యవంతుడు. గౌరవవంతుడుకూడాను నా తల్లి నా చిన్నతనంలోనే కాలంచేయడంవల్ల నేను తండ్రి యొడిలోనే పెరిగాను. ఏకపుత్ర విశేషంయగుటవల్ల తల్లి లేనివాడనగుటవల్ల నన్ను చాలా గారాబంగా పెంచారు. ఇప్పటివాడికే అప్పుడున్న రాజ్యమంతా యల్లకల్లోలంగా యుండేది. అస్పృశ్యుల యొక్క దురాగతములు అంతు లేకుండా ఉన్నయి. వారి దండనలకు గురియైన దీనులయొక్క హృదయ విదారకమైన

యాస్త్రి శాపములు వినినతండ్రి భరించలేకపోయాడు. వారి రక్షణకై యాందోళన సాగించాడు. అందువలన నాతండ్రికూడా రాజకర్మచారుల కోపానలానికి గురియైనాడు. వారు విధించిన యర్థదండనవలన నా తండ్రి హతాశుడై సర్వస్వము నర్పించి, దేశసేవాతత్పరుడై, పట్టణసమీపముననే యడవియందు నివసించుచున్న, స్నేహితుడును విద్వాంసుడును అగు నొక సాధుపుంగవుని కుటీరంలో నన్ను వదలి, యెచ్చటికో వెళ్ళిపోయినాడు. తరువాత నేను సాధుపుంగవునివద్దనే కాలంగడుపుతున్నాను.

ఆ మునీశ్వరునకు ఒక కన్యకారత్నం ఉంది. మాయిద్దరిని జతచేసి విద్యాబుద్ధులు నేర్పుట మొదలెట్టాడు. ఎల్లప్పుడు నొక్కచోటనే నివసిస్తూ, కలసిమెలసి యుండుటవల్ల మాకు గాఢమైన స్నేహం కుదిరింది. చాలారోజులు గడచిపోయినవి. సాధుపుంగవుని యంతిమకాల సమీపించింది. మమ్ముల నిద్దరను చెంతకుపిలచి, మంగళప్రదములగు నుపదేశములగావించి, నాచేత యాకన్యకారత్నంయొక్క పాణిగ్రహణం చేయించి యాశీర్వదించి, నిర్విచారంగా పరమేశ్వరసాన్నిధ్యం పొందాడు. మునీశ్వరుని యాజ్ఞానుసారం యామెను పాణిగ్రహణం చేసినప్పటికి యామెతో నాకు నేటివరకు గృహస్థభావం లేదు. విద్యావతి యగు నామె నామధేయం విజయ. పాపం, తుంగా క్రింద నదీగర్భంలో స్థిరమయిన విశ్రాంతి పొందింది. ప్రేమమూర్తియగు నావిజయ నాకెంత సంతోషం కలుగజేస్తూండేది. ఆమెను జూచినమాత్రాన నాకెంతయో యానందముగానుండేది. కాని నాతండ్రికి జరిగిన అన్యాయం పరాభవం నన్నెంతయో బాధిస్తూండేది. అది పూర్తియగునంతవరకు, దుర్మార్గములన్నియు తుదముట్టి దేశమునకు స్వాతంత్ర్యలాభం కలుగువరకు నేను బ్రహ్మచారిగా నేయుండ నిశ్చయించుకున్నాను. నాబొందిలో యూపిరి యున్నంతవరకు, నా మనోభిలాషను మాత్రం వదలుకోజాలను. కాని విజయ మనోభిలాష పూర్తి కాలేదనిమాత్రం మిక్కిలి విచారంగా ఉంది." అని చెప్పి యానందకుమారుడు మాట్లాడలేకపోయాడు. ప్రాణపదమైన విజయ జ్ఞాపకానికొచ్చింది. కంటివెంబడి నీరు బొటబొటలాడింది. ఇదంతయు వినేసరికి విచారసంభ్రమములు రెండును ఒక్కసారిగా కలిగినవి. మునీశ్వరుడు కన్నీటిని యాపుకోలేకపోయాడు.

కొంతసేపటికి యువకుడు దుఃఖావేశమును యాపుకున్నాడు. దేశముక్తికి వలయు నుపాయములను అనుభవజ్ఞుడగు నామునీశ్వరునివద్ద నేర్చుకున్నాడు. దుర్మార్గులగు శత్రువులతో మెలగవలసిన పద్ధతులన్నియు తెలుసుకున్నాడు. కొలదికాలంలో స్వస్థత పూర్తిగా కలిగింది. మునీశ్వరునకు కృతజ్ఞతాపూర్వక వందనములనేకముల నర్పించి దేశసేవకై నడుముకట్టుకుని బయలుదేరాడు.

(4)

ప్రేమలో పడి పిచ్చిదై పోయింది విజయ. ఘోరారణ్యంలో దారితెన్నూ గానక, పడుతూ లేస్తూ, దేశసేవాధురంధరుడగు ప్రాణేశ్వరుని నామం జపిస్తూ, చాలారోజులు గడిపింది. ఒకనాడు యదృష్టవశాత్తు దారితప్పి ఒకగ్రామం చేరింది. అప్పుడే తెల్లవారుతోంది. పక్షులు తిరిగి వెలుగు చూడగలిగినందుకు సంతోషముగా యొకచెట్టుమీదనుంచి మరియొక చెట్టుమీదికి గంతులేస్తూ, తమ కలకలారావములతో సూర్యభగవానునికి స్వాగతం యిస్తున్నాయి. ఆనందమయమగునట్టి ప్రభాతసమయమందు యాగ్రామం యుదాసీనంగా యున్నట్లు గ్రహించింది. ఆస్ట్రియనుల పరిపాలనావిధానం యిప్పుడామెకు బాగా బోధపడ్డది, వారు దేశానికి కల్పించిన దారిద్ర్యం కన్నులారా చూచింది. తన ప్రియుని వాక్యాలన్నీ సత్యములే ననుకున్నది. గ్రామస్థులందరు దీనులుగాను దరిద్రులుగాను యగుపడ్డారు. నివసించుటకు వసతులులేవు. తినుటకు తిండిలేదు. కట్టుకొన గుడ్డలేదు. దిక్కులేనివారివలె చెట్లుచేమలక్రింద అల్లాడుతున్నారు. అది చలికాలం. మాఘమాసం. భయంకరమైన శీతవాయువు వీస్తోంది. అఖిలం అదలిపోయింది. ముండ్లపొదలకు తగుల్కొని జీర్ణమైన వస్త్రమును ధరించడంవల్ల చలికి గజగజ వణకిపోతూంది. తనకంటెను దరిద్రులుగా నగుపడుటవలన తనకేమాత్రం సౌకర్యం కలుగదని యనుమానించింది. కాని బాధలోనున్నవారికి యుక్తాయుక్త విచారణగాని, ఆదరణ యనాదరణలుగాని, ఆహ్వానవిసర్జనలుగాని అవసరంలేదు. అనాహూతముగా ఒకగుడిసెవద్దకు వెళ్ళింది. గొప్పవారికంటె బీదవారికే జాలి యెక్కువ. ధనవంతులకంటె దరిద్రులకే త్యాగం యెక్కువ. ఈమెస్థితి గాంచి ఆయింటివారు చాలా జాలిపొందారు. వారు పరుండియున్న గడ్డిలో కొంతభాగం తీసి, చలిమంటవేసి, యామెయొక్క శీతబాధను నివారింపజేశారు. అట్టినిష్కల్మషులసేవ చేయుటయేగదా స్వర్గము. ఆదరిద్రుని త్యాగమునకు యామె యానందపరవశురాలైంది. ఊరూరు తిరిగిచూచింది. దరిద్రులసంఖ్యయే నామెకు యెక్కువగా యగుపడ్డది. దీనికంతకు కారకులు ఆస్ట్రియనులే యని తెలుసుకుంది. తనకువారియెడలగల ద్వేషం ద్విగుణీకృతంఅయింది!

వెంటనే సన్యాసినివేషం ధరించింది. త్రిశూలం చేతబట్టింది. స్వదేశగీతములను పాడుతూ, ఊరూర యింటింటికి తిరిగి ప్రజలలో యుద్రేకం కలుగజేస్తోంది. అతిశ్రావ్యంగా పాడుతుంది కూడాను. గానముచేత యువకుల హృదయములయందు సాయుధబీజములను నాటింది. అనేకుల నాకర్షించింది. ఆమె అధ్యక్షతక్రింద ప్రాణములనైనను యిచ్చుటకు సిద్ధముగానున్న యువకులు వేనవేలు పోగైనారు.

మిలాను నగర పరిసర గ్రామములయందు మునీశ్వరుడు సంచారం మొదలెట్టాడు. దేశభక్తిపూరితము లగు నుపన్యాసముల చేత జనసమూహంలో యుద్రేకం పూర్తిగా కలిగించాడు. అతని యాజ్ఞానుసారం అగ్నిలోనైనా దూకుటకు ప్రజలంతా సిద్ధంగా నున్నారు.

ప్రజలలో కలిగినయుద్రేకం పరిపాలకులు గ్రహించారు. అల్లరులు యణచివేయడానికి సైన్యములను పంపించారు. రాజద్రోహులనందరను కఠినంగా శిక్షించుటకై తగిన ప్రయత్నాలు విరివిగా చేశారు.

జనసమూహంలో యుద్రేకం పూర్తిగా కలిగిపోయింది. అందరు ఒక్కసారిగా పరిపాలకులమీద తిరుగబడ్డారు. అందరు కలసి ఒక గొప్పసైన్యంలాగ తయారయినారు. ప్రతిహృదయమందు స్వతంత్రతాపేక్ష పొంగి పొరలిపోతోంది. ఆనందకుమారుడుకూడా సమయానికే వచ్చి సైన్యంలో కలిశాడు. వాయువుకు యగ్నితోడైనట్లుంది. అతడు పూర్వీకుల శౌర్యసాహసములగురించి వారికి బోధించడం మొదలెట్టాడు. ఉద్రేకపూరితులై, యల్పసంఖ్యాకుల మను చింత యేమాత్రం లేకుండా పరిపాలకులసైన్యంమీద తిరుగబడ్డారు. ఘోరమైన సంగ్రామం జరిగింది. ప్రజాసైన్యం తక్కువగను, పరిపాలకులసైన్యం హెచ్చుగను యుండడంవల్ల ప్రజాసైన్యం వెనుకంజవేయడానికి సిద్ధంగా ఉంది. మాతృదేశంకొరకు జనులు వేనవేలు తమరక్తమును ధారపోశారు. రక్తప్రవాహం వెల్లువలై ప్రవహిస్తోంది. సమయమునకే మునీశ్వరుడు గొప్పసైన్యసమేతంగా వచ్చి వారలను కలుసుకున్నాడు. విజయ మరొకవైపునుంచి పెద్దసైన్యంతో వచ్చిచేరింది. సైన్యమంతయు అంతులేని పారావారంలాగ ఉంది. సంకులం వృద్ధి అయింది. చావగా మిగిలిన యాస్ట్రియనులు ప్రాణరక్షణకై పారిపోయారు. మిలాను నగరం ప్రజాస్వాధీనం అయింది.

కాని మునీశ్వరునకు బలమైన గాయాలు తగిలినవి, "ఆహా! నాజీవితమందు నేను స్వతంత్రుడనైనాను" అని యనుకొనుచు నేల కొరగిపోవుచుండగా, చేరువనేయున్న యానందకుమారుడు చూచాడు. పరుగెత్తుకవచ్చి తన ప్రాణరక్షకుడైన మునీశ్వరుని నొడియందు చేర్చుకున్నాడు.

మునీశ్వరుడాతని దేశసేవ నెంతయు కొనియాడి, యాతని కౌగలించుకున్నాడు. నాడు జరిగిన విజయావృత్తాంతమును చెప్పడం మొదలెట్టాడు. అప్పుడు విజయ మూర్తీభవించిన శౌర్యవిలాగ వారలయెదుట ప్రత్యక్షమైంది. వారల సంతోషమునకు మితిలేదు.

మునీశ్వరుడా విజయానందకుమారుల నిద్దరను దగ్గరకు చేర్చుకున్నాడు. గాయములబాధ యెక్కువయింది. మరణకాలం సమీపించింది. ఇక తన రహస్యమును దాచలేకపోయాడు. చిన్నతనమునందే మునియాశ్రమమందు విడచి వెళ్ళిన ఆనందకుమారునితండ్రి తానేనని చెప్పేశాడు. దేశమాతృసేవ చేస్తూ ప్రాణములను వదలిపెట్టాడు. ఆనందకుమారుడు ఆశ్చర్యపోయాడు. ఇంతకాలంనుంచి తండ్రిని గుర్తించలేనందులకు మిక్కిలి విచారపడ్డాడు.

(5)

ఆస్ట్రియనుల పరిపాలన యంతరించింది. మిలాను స్వాతంత్ర్యమైంది. విజయానందకుమారులు స్వతంత్రడోలికయందు సరససల్లాపాలాడుకుంటూ, నిర్విచారంగా ఊగుతూన్నారు.

# శ్రీ కవిసార్వభౌమ
# శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు

దేశాభివృద్ధికి మూలము భాషాభివృద్ధి. భాషాభివృద్ధికే జ్ఞానాభివృద్ధి యగువారలే దేశభక్తులనుదురు. అట్టివారు భాషామూలమున దేశసేవ చేసినచో, దేశమంతయు విద్యామయమై యచిరకాలమున నభివృద్ధిలోనికి వచ్చుననుటకు సందియంబు లేదు.

దేశసేవచేయుట కనేకమార్గములు కలవు. కొంద ఱుపన్యాసముల నిచ్చియు, కొందఱు వ్యాసముల రచించియు పత్రికాముఖమున వెల్లడించియు, కొంద ఱప్పుడప్పుడు సభల నిర్మించి దేశసేవావిధానముల జర్పించుటయు, నింక ననేకవిధంబుల, సేవచేసి దేశభక్తులనుచున్నారు. సద్గ్రంథములు రచించుటయును దేశసేవతో చేరినదనియే నా యభిప్రాయము. మహావీరులు దేశభక్తిగలిగి యిచ్చు యుపన్యాసములు తీవ్రములై పండితపామరుల హృదయపీఠికల నెట్లు నాటుకొనుచున్నవో, యట్లులే, సద్గ్రంథ పఠనము చేసి యందలి ధర్మనీతి జ్ఞానసంపత్తిని గాంచుటచే ప్రజలు వివేకులై, తాము చేయవలసిన దేశసేవయం దట్టి వివేకము నుపయోగింతురు. అదియునుగాక, యే మహాకార్యము చేయబూనినను దగినంత జ్ఞానోదయ ముండవలె. అట్టి జ్ఞానోదయమును భాషామూలమునగాని లభింపదుకదా. అట్టి భాషాభివృద్ధి గావలెనన్న నీతిబోధకంబులగు సద్గ్రంథపఠనము చేయవలె.

మన కవిసార్వభౌమగారు యీరహస్యములను గ్రహించి దేశాభివృద్ధికి సద్గ్రంథరచనవలె ప్రథమ సోపానములని యెంచి మహాకార్యమును కైకొనిరి. అందు వేదవ్యాసరచితంబై, వేదపుంగ్రంథమై, యుక్తియుక్తంబై, ధర్మముల కునికిపట్టయి, నీతిబోధకంబై వెలసిన హిందూమతగ్రంథములలో ప్రధానంబగు నొప్పు శ్రీ మహాభారతమును మూలానుసారము తెనిగింపం బూనుట మిక్కిలి సాహసకార్యంబనందగు. మిక్కిలి కష్టతరంబు. అదియునుగాక, యొక్క సంస్కృతప్రతి ననుసరించి వ్రాయబూనిన నిగ్రహింపవచ్చు. ఈ మహాకవి యటులగాక, యెంచుమించు నాలుగైదు సంస్కృతప్రతులను పరిశోధించి, యందుముఖ్యముగా కలకత్తా కాశీ మహాపట్టణములకు బోయి, యచటగల సంస్కృతప్రతులను నామూలాగ్రముగ తిలకించి, యెంతో విశేషపరిశ్రమ చేసి తెనిగింపబూనిరనువిషయము వారి భారతరచనవలనే కానంబడుచున్నది.

పూర్వకవులవలె యీ కాలపుకవులు వరప్రసాదలబ్ధులు కాకపోయినను వారికిగల దారిద్ర్యముమాత్రము వంశపరంపరగా వచ్చుచున్నదో యనునట్లు కవియని పేరు పెట్టుకొన్నవారి కందరికిని లభించుచున్నది.

మనకవిగారిట్టి యుద్యమమూనుటగాను విశేషధనము వెచ్చింపవలసి యున్నదనుట విశదమేకదా. అందుకుదగిన సమర్థులుకారు.

పోనీ, దేశదేశముల దిరిగి భిక్షాటనచేసి యీ కార్యము నిర్వహించకూడదా యని తలంచినను, యీకవిగారు యట్టి యుద్యోగమును వహింపలేదని యీ దిగువ పద్యమువల్లనే తెల్లమగుచున్నది.

ఉ. దైన్యములేని గోత్రమునఁ దండ్రియుఁ దాతయుఁ దాతతాతయున్, మాన్యతఁ గాంచిరేను నొకమానిసి కంజలి చేసి మ్రొక్కఁ, నా మాన్యుని రీతి పొట్టకయి మానవవాధుల నాశ్రయింపుమటన్, ధన్యముగాఁ దలంపవి మతంబెనసం డెడు నాడుఁ గృష్ణుఁడన్!

ఈ మానవ ప్రపంచంబున మానవుడనేకార్యము చేయబూనినను ననేక యంతరాయములు కలుగుచుండును. తగినంత మిత్రబలమైనను, నర్థబలమైనను, వాక్సహాయమైనను, ప్రోత్సాహమైనను నుండవలె. మన శాస్త్రులుగారికట్టి దొకటియు నున్నట్లు కానంబడదు.

అయితే యీసందర్భమున నొక్కవిషయము చర్చింపదగినది. పూర్వకవులకు తగినంత యుత్సాహమును, నుత్సాహమునకదోడు ధనవాక్సహాయంబులును గలుగుటయేగాక, వారిని [illegible] రాజశిఖామణులు, యీలోకమున నవతరించిన బుధశేఖరులు

పూజించి, తద్భక్తితో భజించి, గౌరవించి, సంసారదారిద్ర్య మును బాపు సాధనములను గల్పించిరి. విచారమను మాటలేక, మహానందసంభరితులై, రాజాధిరాజులచే సన్మానింపబడి, వారి యాస్థానపండితులై, కవులై, గురులై, బ్రహ్మలై యొప్పు పూర్వకవుల కసాధ్యంబగు కార్యమందునో. ఇందుకు తోడు పూర్వకవులు వరప్రసాదలబ్ధులు. ఇంతటి భాగ్యసంపత్తితో, మహావైభవ విభ్రాజితులై లేశాదవయును లేకయున్న పూర్వకవులతో యీనాటికవులను బోల్చిచూచుట సంభవము గదా! అయినను కొన్నివిషయములలో మనకవిగారిని వారితో బోల్పవచ్చు. వారి కవిత్వమునకును వీరి కవిత్వమునకును, వారం తటివారు వీరుకాకపోయినను, పరిపోల్చిచూచిన, కవితావిషయ ములో రెంతమాత్రమును తీసిపోవరని కొందఱు గ్రహించి గల్గినంత రసుభయముతో నొక్కి చెప్పజాలుదున్నాము. అయినను నా యభిప్రాయమున, మన కవి సార్వభౌమగారి భారతరచ నను పరిశీలించిన, స్థాలీపులాకన్యాయమున నప్పటచ్చట జది వినయందుపైన కలుగుయభిప్రాయములను వెల్లడించుటగాక, నన్నయాది భారతముండగా నికేవల యీ భారతమేల యని యీర్ష్యాభావమున చదువుటపైన కలిగిన యభిప్రాయమునగాక కవిసాంప్రదాయమున కలుగు వివాదములనే ప్రధానముగా వహించి తర్కించినంతట తేలుభావముగాక, నిశ్చలమానసు లై, శ్రీకృష్ణభారత మాద్యంతము నోపికవహించి ప్రతిఘట్ట మందును నన్నయాదిభారతపద్యగద్యరచనలతో పరిపోల్చిచూచిన నన్నయాది పోకడలను ధిక్కరించునని చెప్ప నక్కరలేదు. కాని, యించుమించు వారి కవితావైభవమునకు వెనుదీయ దని చెప్పవచ్చు.

మూలము ననుసరించి తెనిగించుట సామాన్యవిషయము కాదు. అంతటి మహాకావ్యమును తెనిగింపం బూనుటయే, సాహసమని చెప్పియుంటినిగదా! అద్భుతరచనలు, రసవంతమైన పద్యములు, సరసమైన సమాసములు, జిలిబిలిముద్దుపల్కులు, అనర్గళధారాప్రవాహము, సొగసైన యమకము, ఇంపునింపు వాగమృతంబులు, ముద్దులు మూట గట్టు పోకడలు, సీసపద్యములకీవి, గద్యమునందలి నేర్పు, భావ యందలి పాండిత్యము, కవితావైభవము, సులభశైలిని వ్రాయుశక్తి యిత్యాదివర్ణనలతో కూడిన శ్రీకృష్ణభారతము గంగానదీ ప్రవాహమువలె ధారాళంబై, సత్కవుల మనం బులకుంబోలి స్వచ్ఛంబై, కల్పతరువుభాతి ఫలవంతంబై, మిక్కిలి శోభాయమానంబై, శృంగారంబై, నవరసప్రధానంబై, వేయే ల! యమృతతుల్యంబై, యొప్పుచున్న దని, యామూలాగ్రము గా చదివిన చదువరులు గ్రహింపకమానరు. ఇన్నిమాట లెందుకు? ద్రౌపదీసత్యభామాసంభాషణసందర్భమున పాతివ్రత్య మహి మను వెల్లడించు పద్యములనుగాని, ద్రౌపదీసైంధవ సంభాషణ మందు వీరరసమును గక్కుపద్యములందలి కవితాశక్తిగాని అభి మన్యుని వధయందు, సుభద్రార్జునుల విలాపమును సూచించు ఘట్టమునగాని, విదురనీతిని వెల్లడించు పద్యములనుగాని, యు ద్యోగమందు ద్రౌపదీకృష్ణుల, కుంతీకృష్ణుల సంభాషణము లయందు నొప్పించిన పద్యసారములగాని, భగవద్గీతామాహాత్మ్య మును వెల్లడించు భక్తి, నీతి, జ్ఞాన, వైరాగ్యబోధకంబు లగు పద్యరచనలంగాని, బాగుగా విమర్శించిన శ్రీకృష్ణకవిగారి శక్తి, నేర్పునకు గుంజపైన చేయివైచుకొని అబ్బా! ఏమి కవితా మాధుర్యము! కవిసార్వభౌముఁడను బిరుదు వీకే తగు నని యు ననివా రుందురా? యని నావమ్మకము. అట్టిసందర్భమున, మన కవిగారికి కూడ ఏదైన వరప్రసాద మున్న దాయని శంకింపక మానరు. ఒక్కమానవుఁడు, ఒక్కకృష్ణకవి, ఒకేతీరున శ్రీ మహాభారతమును తెనిగించి పద్యశము గాంచెనని యాశ్చర్య ము జనింపకమానదు. ఈ భారతమును తెనిగించుటలో యీ కవికొక్కనికే తగిన దని శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగా రొకానొకసమయమున రచించిన యీ దిగువ పద్యము సార్థక మైనదని చెప్పవచ్చు.

ఉ. ఎందఱురాజు లెన్నికృతు లెందఱచే గృతినందిరేని నీ
చందమునన్ యశమ్మొనవజాలరు, భారతమన్న వేదపుం
గందము తాదృశంబయిన గ్రంథము కృష్ణుఁడె విప్పిచెప్పు, నా
యందమునట్లు పెట్టి? విని నన్నుఁడె యందు తెలుంగు సేసెనన్.

పాపము! ఈ భారతరచనకు బూనిన మన కవిగారికి కష్టపరంపరలు గోరుచుట్టుపై రోకటిపోటుచందంబున సంభ వించినవి. అరణ్యపర్వము వ్రాయుతరి, నిట్టి ధన్యచరిత్రుని గాంచిన వీరికి జనని పరలోకగతురాలయ్యె. వీరికి తగనివ్యాధి జనించె. వేయేల! జగమంతయు వీరి కరణ్యంబై తోచె. అయి నను, దైవసహాయమున నెట్టులో వీరు అరణ్యార్ధిని తీఁడి బైటపడిరి. తదనంతరము వీరి బహుజన్మసుకృతతపఃఫలమో యనగనొప్పు సుదర్శనపుత్రుఁడు కేవలము సుదర్శనుఁడని చెప్ప వచ్చును. ఆ సుదర్శనుఁడు అభిమన్యునివధను వ్రాయుసమయ మున వీరిని భంగపెట్టె. నాఁడు అర్జునువిలాపము, అర్జునుని బాధ మనము చూడలేదుగాని, యర్జునసమానులైన యీ కవిగారి మనోవ్యసనము, ఏకపుత్రశోకము, కన్నులారచూచిన నాకొకటివానికి వర్ణింప వలనుకాదు. వ్రాయుదమన్నను కల మాడకున్నది. ఈ గాయములు మానుటకు మందులేదు. అట్టివేళ నెట్టులో ధైర్యము బూనిగాని, యీశ్వరప్రేరితులై, యా రంభించిన కార్యము కొనసాగింపకపోవుట మహాత్ముల లక్షణ ముకాదని గ్రహించి, శాస్త్రిలుగా రిన్నిబాధలకులోనై గ్రంథమును బూర్తిచేసిరి.

వీరు అశ్వాసాంతపద్యములయందు పూర్వకవులవలె గాక నూతనపక్కిని ద్రొక్కియున్నారు. ఆహా! యేమి యా శ్వాసాంతపద్యరచన పోకడలు. ఈ పద్యములు భక్తి, జ్ఞాన, నీతి, వైరాగ్యబోధకంబులై, మానవులకు ధర్మమార్గదర్శకం బులై యున్నవని చెప్పుటలో నతిశయోక్తిలేదు. అందుచే శ్రీకృష్ణభారతమునకు నాశ్వాసాంతపద్యములె మఱింత వన్నె పెట్టినవి.

ఈనాఁడు, విద్యాగంధ మెఱింగిన రాజరాజనరేంద్రుని వంటి రాజశేఖరుండును, కవితాసార మెఱుంగు శ్రీకృష్ణదేవ రాయలవంటి నృపపుంగవుండును, కవితారసజ్ఞుఁడగు భోజ రాజువంటి సత్ప్రభువును, నుదయించినచో, మన కవిగారిని బంగారుపల్లకి నెక్కించి, యూరేగించి, యీ కృష్ణకవి కేవ లము శ్రీకృష్ణుండే యని బ్రహ్మరథము పట్టకపోదురా? అయి నను, శ్రీ కృష్ణకవిగారి కట్టిలోటు సంభవించుటచే భారత మాత వేయివిధముల గన్నీట్టుచున్నది. అది యెట్టిదనిన, భారత మును సంపూర్ణముగా రచియింపజేసి, యచ్చొత్తించెడు భాగ్యమిచ్చి, లోకమున నద్యశమును బ్రాకంగజేయుట సామా న్యవరమా? జన్మజన్మములకు నిట్టిభాగ్యం బొకండు చాలు. అందుచే వీరిజీవితము ధన్యమైనది, పుణ్యమైనది, కీర్తిదాయక మైనది, శ్లాఘాపాత్రమైనది.

అదియునుగాక, ఆంధ్రలోకము వీరియుద్యమమును, బట్టు దలయు, దిలకించినది. ఆంధ్రమహావీరులు. ఆంధ్రకవిశిఖామణు లు, వీరికిగల సామర్థ్యమెఱింగి, కవిసార్వభౌములని బిరుదిచ్చుట యే వీరికి రెండవభాగ్యమని చెప్పవచ్చును. ఇంతకు మించుమహా దైశ్వరం బెద్దియును లేదు. నాఁడు శ్రీనాథుఁడు కవిసార్వభౌముఁ డయ్యె. నేఁడు మనకవిగారు శ్రీనాథుని శిష్యుఁడైనందుకు కవి సార్వభౌముఁడై తగినశిష్యుఁ డనిపించుకొన్నవారు. గురుశిష్య న్యాయమనగా లోకమం దిట్టు లుండవలె.

నన్నయాదుల భారతమువలెనే, వీరి భారతమును రాజ మహేంద్రవరపురమున జనించినది. కావున నావిధముగనే పెరిగి, యాంధ్రులచే పోషింపబడి, నానాటికి అభివృద్ధి యగునుగాక.

రాజమహేంద్రవరము కవిబృందంబులకావమై యలరు గాక. శ్రీకృష్ణకవిసార్వభౌమునకు శ్రీకృష్ణభగవానుఁడు చిరాయురారోగ్య ధనధాన్యసంపత్తి నొసంగి, యాచంద్రతారా ర్కము బ్రోచి, దేశదేశముల వారి కీర్తిలతను వ్యాపింపజేయు గాక.

ఇట్లు: బుధజన విధేయుఁడు,
వాజపేయాజుల రామసుబ్బారాయుఁడు, బి. యె.
హెడ్ మాస్టరు, శ్రీ రాజా సురభి వేంకటలక్ష్మీరాయ
మిడిల్ స్కూలు, కొల్లాపురం, జటప్రోలుసంస్థానం.

పంచరత్నములు

సీ. కాంచినాఁడవుగదా కవిసార్వభౌముఁడన్
బిరుదంబు బెజవాడపురమునందు,
రచియించినావు భారతగ్రంథ మంతయు
దెనుగున సొగసైన తెలివి జూపి,
జయమును గాంచితి సభలయందు శతావ
ధానముల్ సలిపి సద్యశము గాంచి,
పొందినాఁడవుగదా భూపతిగౌరవం
బు తగినరీతి ప్రమోదమొంద.
తెలిపినాఁడవుగద మేటివిశ్రుతాన్వ
యమున శ్రీపాదకృష్ణయాఖ్యయని యొప్పి
రాజమహేంద్ర పురమునందు రాణ మిగుల
నాపమొనరించుచుంటివి భవ్యచరిత!

శా. నిన్నుం జేర్కొన శక్యమౌనె! తలపన్ శేషుండు నా
ద్యంతమున్ విన్నాణంబుగ వ్రాయు భారతము నీవిఖ్యాతియున్
దెల్పి, శే! యెన్నంజాలదె? నీప్రతాపమును రూపింపంగ, శ్రీ
కృష్ణ! శేషుఁ! నిన్ను మది నుంచి మ్రొక్కెద సదా నిర్నిద్ర
వాక్సిద్ధికిన్.

ఉ. భారతమున్ రచించుటను భారతపుత్రుఁడ వన్న పేరు వి
ద్యారుణి నిల్పి సద్యశము దద్దయు దాల్చితి వన్నికష్టముల్
వారక నిన్ను మల్మినను భవ్యగుణుండును గూలితోయినన్
ధీరత నోర్చి పట్టుకొని చెట్టన చెట్టితి భారతాంబుధిన్.

ఉ. శ్రీకర రాజమహేంద్రపురసీమను గోపుర మందువాఁడవై
ప్రాకటభక్తియున్ గలిగి భారతమంతయు దెల్గునందునన్
జేకుఱునట్లుగా రచనచేసెడి ప్రజ్ఞ గలాఁడవైతి వీ
లోకమునందు నా జగములోన నినున్ గొనియాడరే బుధుల్.

ఉ. నన్నయకాలమందు నరనాథులు సత్కవులన్ గ్రహింప, నా
రెన్నియొ సత్కృతుల్ సలిపి యిమ్మహిమించి కృతార్థులైరి,
నీ! నన్నో యెట్టిసాయమును నందకపోయిన ధైర్యమూనుచున్! నన్నయయుం బాసియున్ గలుగు భారతమాది యనేక
గ్రంథముల్! క్రన్నన వ్రాసి మించితివిగా భువిలోఁ గవి
సార్వభౌమ! తర్కన్.

## బెజవాడ

(స్వకీయవిలేఖరి)

### జాతీయగీత ము.లు, ఖద్దరునుగూర్చి ప్రభుత్వవైఖరి

జనవరి 14:—మా మ్యునిసిపల్ చేర్మనుగారి గవర్నమెంటునుండి ఒక శ్రీముఖము వచ్చినట్లు వదంతిగ నున్నది. అది రహస్యముగ నుండవలెనని గవర్నమెంటువారి యభిప్రాయమట. మ్యునిసిపల్ హైస్కూలులో జాతీయగీతములను పాడించవలెనని ఉపాధ్యాయులెల్లరు ఖద్దరునే ధరించవలెననియు, విద్యార్థులెల్లరు ఖద్దరును ధరించేలాగున ఉపాధ్యాయులు ప్రచారము చేసి, ప్రచారమువలన ఖద్దరుమధరించుట యేరీతిగ అభివృద్ధియగుచున్నదియు నెలనెలకు రిపోర్టు పంపవలయునని మా చేరుమెన్ గారు ఉత్తరువునిచ్చిరట. మరియు చిన్నపురిలో జరిగిన జాతీయమహాసభకు వెళ్ళదలచుకొన్న ఉపాధ్యాయబృందము వెళ్లుటకనుకూలమగునట్లుగ నూపర్ వైజింగు హెడ్ మాస్టరుగారితో సంప్రతించకుండగనే క్రొందిగ్సూలుకు 1927 డిసెంబరు 22 తేదీ మొదలు 1928 జనవరి 8 వ తేదీవరకు మా చేరుమెన్ గారు సెలవు యిచ్చినారట.

ఇందులకు సంజాయిషీ నీయవలసినదని గవర్నమెంటువారంపిన శ్రీముఖమునందు గలదని చెప్పుకొనుచున్నారు.

హెడ్ మాస్టరుగారిని ఇందునుగూర్చిన సమాచారమును తెలుపుమని చేరుమెన్ గారు వ్రాసినారట.

ఈ నెల 20 వ తేదీలోపలనే చేరుమెన్ గారు జవాబు పంపుదురని తెలియుచున్నది.

### ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు భవనము

బెజవాడ గవర్నరుపేటలో నున్న పాపట్ల పూర్ణయ్యగారి డాబా యింటిని ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ ఆఫీసునిమిత్తము 15 వేల రూపాయలకు కొన్నట్లు వినుచున్నాము. దీనిపైని 5 వేలు పెట్టి మేడ కట్టుదురట. మాఘము వెళ్లినతోడనే ఇందు కాంగ్రెసు కమిటీ కార్యాలయమును ప్రతిష్ఠింతురని తెలియుచున్నది.

### తూత్తుకొడి తాలూకా మహాసభ

తిరునల్వేలి, జనవరి 15:—ఈ మహాసభ ఫిబ్రవరి నెలలో జరుగును. ఈ మహాసభకు అధ్యక్షతవహింప శ్రీ. ఇ. వేదగుప్తగారిని ఆహ్వానించుటకు స్వాగతసంఘమువారు తీర్మానించిరి.

(ఆ. ప్ర.)

## సుభాష్‌చంద్రబోసుపై కేసు

ప్రతివాదిప్లీడరు వాదములు ముగియుట

కలకత్తా, జనవరి 13 —లాహోరు కుట్రకేసులోని ముద్దాయిలు నిరశనవ్రతము గావించినప్పుడు వారికి సానుభూతి తెలియజేయుటకై గాను కలకత్తాలో జరిగిన ఊరేగింపు సందర్భమున సుభాష్‌చంద్ర బోసుగారు ఇంక 11 రు రాజద్రోహము నకు కుట్రకను చార్జి చేయబడినని పాఠకు లెరుంగుదురు. ఆ కేసులో ప్రతివాది ప్లీడరువాదము నేడు ముగిసెను.

తీర్పు జనవరి 28-వ తారీఖున చెప్పబడును.

ప్రతివాదులవాదము

కాంగ్రెస్‌వాదుల పక్షమున వాదించుచు శ్రీ. సి. ఛటర్జీగారిట్లు చెప్పిరి. ప్రస్తుత రాజకీయములలో గాంధి మహాత్ముని అహింసాసిద్ధాంతము శక్తివంతముగా పనిచేసినట్లు మరియే సిద్ధాంతమును పనిచేయ వలెను. కాంగ్రెసువాదులు దౌర్జన్యరాహిత్యము నందగా గాని, అధినివేశప్రతిపత్తికై ప్రయత్నించుచున్న తరిగాలము రాజద్రోహమేమియు లేదు. అధినివేశ ప్రతిపత్తిస్వాతంత్ర్యముయొక్క స్థితికి వచ్చుచున్నది. ఏలనగా, అధినివేశప్రభుత్వములు కోరిన చో ఆంగ్లదేశమునుండి విడిపోవచ్చునని అందరును అంగీకరించుచున్నారు. లాహోరు కాంగ్రెసుకు పూర్వము నా పార్టీలు కలకత్తా కాంగ్రెసు తీర్మానమునకు బద్ధులైయుండిరి. న్యాయ సమ్మతముగా స్థాపింపబడిన ప్రభుత్వమే ధర్మమైన ప్రభుత్వము. కాని ఆకారము అట్లుగాదు. దానిని మార్చవచ్చును. దానిని మార్ప ప్రయత్నించుట రాజద్రోహము కానేరదు.

(స్వ. ప్రె.)

## వాతావరణస్థితి

1930 సం॥ జనవరి నెల 16-వ తేదీ గురువారము

| ముఖ్యస్థలములు | గత 24 గంటలలో అత్యధిక ఉష్ణము | గత 24 గంటలలో అత్యల్ప ఉష్ణము | గత 24 గంటలలో వర్షము | జనవరి 1-వ తేదీనుండి వర్షము | సామాన్యముకన్న హెచ్చుతగ్గులు |
|---|---|---|---|---|---|
| గోపాల్ పూర్ | 82 | 65 | ... | 0 | — 0.1 |
| విశాఖపట్టణము | 79 | 66 | ... | 0 | — 0.2 |
| కాకినాడ | 84 | 64 | ... | 0 | — 0.1 |
| మచిలీపట్టణము | 81 | 63 | ... | 0 | — 0.1 |
| కర్నూలు | 91 | 62 | ... | 0 | — 0.1 |
| బళ్లారి | 88 | 60 | ... | 0 | 0 |
| అనంతపూర్ | ... | ... | ... | 0.1 | + 0.1 |
| కడప | 85 | 66 | ... | 0.4 | + 0.1 |
| నెల్లూరు | 85 | 66 | ... | 0 1 | — 0.9 |
| మద్రాసు | 85 | 68 | ... | 1.5 | + 0.7 |
| కడలూరు | 83 | 63 | ... | 8.5 | + 7.6 |
| వెల్లూరు | 84 | 65 | ... | 1.4 | + 0.8 |
| సేలము | 90 | 63 | ... | 0 2 | + 0 1 |
| కోయంబత్తూరు | 86 | 60 | ... | 0.8 | — 0.1 |
| తిరుచునాపల్లి | 87 | 65 | ... | 1.5 | + 1.1 |
| నాగపట్టణము | 82 | 72 | ... | 13.8 | + 12.7 |
| మధుర | 89 | 67 | ... | 0.6 | + 0.8 |
| పాంబన్ | 82 | 66 | ... | 4.3 | + 3.1 |
| పాలంకోట | ... | ... | ... | 0.5 | — 0.4 |
| తిరువేంద్రము | 84 | 71 | ... | 0 5 | + 0.1 |
| కొచ్చిన్ | 84 | 70 | ... | 0 8 | — 0.1 |
| కాలికట్టు | 89 | 69 | ... | 0 | — 0.2 |
| మంగుళూరు | 86 | 70 | ... | 0.1 | 0 |
| బెంగుళూరు | 83 | 17 | ... | 0 2 | + 0 1 |
| మెర్కార | 79 | 57 | ... | 0.1 | + 0.1 |
| కొడైకానాల్ | 71 | 49 | ... | 1.7 | — 0.6 |
| కూనూర్ | 78 | 42 | ... | 1.9 | |

కర్నాటకము:— కాకినాడలో నేటియుదయము పొగమంచు కరియుచున్నది. శీతోష్ణస్థితి మామూలుగ నున్నది.

దక్కను:— ఆకాశము మేఘావృతమై యున్నది.

కర్నాటకము:— శీతోష్ణస్థితి మామూలుగ నున్నది.

ఎ. ఎ. నారాయణయ్యరు,

ప్రభుత్వ వాతావరణ శాస్త్రజ్ఞుడు.

## స్వాతంత్ర్యదినోత్సవము

### గాంధిమహాత్ముని ప్రకటన

"ఈ నెల 26 వ తేదీ ఆదివారమునాడు భారతదేశమునందంతటను స్వాతంత్ర్య దినోత్సవము జరుపవలెను. ఆనాడు జరిగెడు సభలలో నెట్టి ఉపన్యాసముల నొవక నవసరములేదు. కాంగ్రెసు కార్యనంఘ సభలో నామోదింపబడిన తీర్మానమును ప్రతి సభలోను ఆమోదించుటయే ముఖ్యకర్తవ్యము. ప్రతి గ్రామమునందును ప్రతి పట్టణమునందును ప్రతి నగరమునందునుగూడ సరిగా నిర్ణయింపబడిన కాలమునందే అనగా ఆనాడు సాయంకాలము 6 గంటలకే సభలను జరుపవలెను. ఆస్తికభావము గలవారానాడుదయముననే స్నానము లొనరించి నూలు వడుకుట, అస్పృశ్యులకు సహాయము, హిందూమహమ్మదీయమైత్రి, మద్యపాననిర్మూలనము మున్నగు నిర్మాణవిధానములను శక్తివంచన లేకుండ జరుపవలెను. ప్రతిగ్రామమువారునుగూడ అతిశయోక్తులులేకుండ యథార్థముగా ఆనాడు జరిగిన విషయములను మాత్రమే విధిగా ప్రధానకార్యాలయమువారికి వెంటనే వ్రాసి పంపగోరదను." అని గాంధిమహాత్ముడు ప్రకటించెను.

(అ. ప్రె.)

## దేశీయవార్తలు

### యతీంద్రనాథసేనుగారు జామీను ఇవ్వకుండుట

కలకత్తా, జనవరి 15:—పట్టుకాళి సత్యాగ్రహము వాయిదకు యతీంద్రనాథసేనుగారు జామీను ఇచ్చుటకు ఇష్టపడనట్లుగ మేజిస్ట్రేటుగారికి తెలిపిరి. వీరు జామీను నెక్కనుల వను వరించి శిక్షింపబడి యుండిరి. (అ. ప్రె.)

### ఇండోరులో మహమ్మదీయుడు హిందూకన్యను వివాహ మొనర్చుకొన నుద్దేశించుట

ఇండోరు, జనవరి 15:—ఇండోరు మహారాజాగారి మంత్రిత్వమును వహించిన సర్ తుకోజీరావు హోల్కారుగారి ఫిప్పందికి చేరిన అబ్దుల్లా గషీదుగారు అను బారిస్టరు ధనగరు తెగకు చేరిన బణ్నా బాయియను హిందుబాలికను వివాహమాడ నుద్దేశించియున్నారు. నందలూరు నాటకశాలయందు హిందువులు సమావేశమై ఈ వివాహము హిందూమతమునకు కళంకము కలుగజేయునని యు అందుచే ప్రభుత్వమువారు వివాహమును నిషేధింపవలయునని యు కోరుచు తీర్మానములు గావింపబడెను. తీర్మానముల ప్రతులు మహారాజాగారికి రాజప్రతినిధికి పంపబడినవి. బణ్నాబాయి ప్రస్తుతము తండ్రి యిల్లువదలి మంత్రిగారి ప్రైవేటు సెక్రటరిగృహమునందున్నది. పోలీసువారు ఆ ఇంటిని కాపలా చేయుచున్నారు. (శ్రీ. ప్రె.)

### అఖిలపక్షసమావేశము

సప్రూగారి ప్రయత్నములకు పలువురసానుభూతి

అలహాబాదు, జనవరి 15:— అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధితో ముచ్చటించుచు తాను ప్రయత్నించిన అఖిలపక్ష సమావేశమునకు పలువురు హిందువులును మహమ్మదీయులును సానుభూతి తెలిపిరని సప్రూగారు తెలియజేయుచున్నారు. అనుకొననివారు చాలమంది తనయుత్నమునెడల నుత్సాహమును జూపిరనియు, ప్రస్తుతస్థితిలో నిరుత్సాహపడుటకు కారణము లేదనియు సప్రూగారు తెలుపుచున్నారు. (అ. ప్రె.)

### సంపూర్ణస్వాతంత్ర్యము—స్థానాధిపతుల కర్తవ్యము

హానకప్ప కృష్ణారావుగారి విన్నపము

శృంగేరి, జనవరి 18:—సంస్థానాధిపతులకు గావించిన విన్నపములో, వారుగూడ భారత స్వాతంత్ర్యపోరాటమునందు ఉత్సాహముతోడను, సంతసముతోడను, పాల్గొనవలెననియు సంపూర్ణస్వాతంత్ర్యమును గడించినభారతదేశములో వారిస్థితిగతులను సంస్థానాధిపతులు విచారించుకొనవలెననియు, కాంగ్రెస్ వారితో సంప్రతించి సంస్థానములు అవిచ్ఛిన్నముగా నుండుటకు వారు ఉపాయములను గనిపెట్టవచ్చుననియు భారతదేశము నకు ఫెడరేటెడ్ రిపబ్లిక్ ప్రభుత్వమున్నచో నిట్టిస్థితి కలుగ ననియు, హానకప్ప కృష్ణారావుగారు వ్రాయుచున్నారు. సంస్థానములు భారతదేశముతో కలసియుండుటకు వారుగూడ తమ తమ రాష్ట్రములకు స్వపరిపాలన యిచ్చుట యుక్తమనియు, సంస్థానాధిపతులు కాలానుగుణముగా తమ రాజ్యాంగములలో మార్పులు చేయుట యవసర మనియు వారు తెలుపుచున్నారు.

(అ. ప్రె.)

## న్యాయస్థానవార్తలు

### ఇన్‌సాల్వెంటుచే జరిగిన విక్రయము

(న్యా. వాలరుగారి యెదుట)

జొన్నలగడ్డ చలమయ్య శెట్టియను ఇన్‌సాల్వెంటు నెల్లూరునందున్న యింటిని తన సోదరియగు కనకమ్మకు గావించిన విక్రయమును రద్దు చేయుటకు అఫిషియల్ అసైనీగారు తెచ్చిన కేసులో న్యా. వాలరుగారు హైకోర్టునందు నేడు తీర్పుచెప్పిరి. 1924 సం॥ జులై 20 వ తేది యిల్లు విక్రయము గావింపబడెను. సెప్టెంబరు 20 వ తేదీయందు ఇన్‌సాల్వెన్సీ పిటిషను దాఖలు చేయబడెను. కావున అట్టి స్థితిగతులందు యిల్లు అమ్మకము చేయుట మోసమని అఫిషియల్ అసైనీగారి తరఫున వాదింపబడెను. అమ్మకమునాటికి దివాలాదారు తన ఋణదాతలకిచ్చుటకుని బాకీ చెల్లింపలేని స్థితి యందుండెను. ఈ యిల్లు ఒకటిమాత్రమే అతని స్థిరాస్తిగానుండెను. ఆ యిల్లే స్వంతసోదరి కమ్మబడెను. 1926 సంలిన సోదరి గతించుటకు ముందు ఇన్‌సాల్వెంటు కుమారులతరపున విల్లుపూర్వకముగా యింటిని వ్రాసియిచ్చి గతించెను. ఇన్‌సాల్వెంటు కుమారులు యింటి అమ్మకము దగాగాదని వాదించిరి.

న్యాయమూర్తులు ఉభయపక్షముల వాదనలు విని, ఇన్‌సాల్వెంటు ఇతర ఋణదాతలనువిడచి తన స్వంతసోదరికే యింటిని అమ్మివేసెననియు, ఇది మోసమేయని నమ్మి విక్రయమును రద్దుచేసి, యింటిని అఫిషియల్ అసైనీగారివశ మొనర్చుటకు ఉత్తరువు గావించిరి.

శ్రీ కస్తూరి శేషగిరిరావుగారు అఫిషియల్ అసైనీ తరఫునను, టి. జి. రాఘవాచారిగారు రెస్పాండెంటుల పక్షమునను వాదించిరి.

### పడవ మునుగుట

కలకత్తా, జనవరి 15 :—ఇండియా జనరలు నావిగేషను కంపెనీవారికి చేరిన నీల్ అను స్టీమలాంచి నేటిదినము మధ్యాహ్నము హుగ్లీనదిలో మునిగిపోయెను. హుగ్లీబ్రిడ్జి తగులుటచే ఆ పడవ మునిగెను. బ్రిడ్జి కొంచెముగ చెడినది. (అ. ప్రె.)

# స్థానిక వార్తలు

**మద్రాసు కార్పొరేషను సంఘసభ:—** మద్రాసు కార్పొరేషను సంఘముయొక్క సాధారణసభ రాబోవు 20 వ తేదీ మంగళవారమునాడు సాయంకాలము 5-15 గం. రిప్పనుభవనమున జరుగును.

---

**రసికరంజని సభ (మైలాపూరు) నాటకప్రదర్శనము:—** 19 వ తేదీ ఆదివారము సాయంత్రము 5 గంటలకు "సుందరేశ్వరహాలు" నందు మద్రాసు అమెచ్యూరు నటులు "శ్రీరామ వనవాసము" ను తమిళభాషలో ప్రదర్శింతురు.

---

**కార్పొరేషను అధ్యక్షునకు విందు:—** రేపు 17 వ తేదీ శుక్రవారం సాయంత్రం 5-30 గంటలకు రిప్పను భవనమందు మద్రాసు కార్పొరేషను ఉద్యోగులు కార్పొరేషను అధ్యక్షులగు శ్రీయుత ఏ. రామస్వామిమొదలియారుగారికి విందు జరిపెదరు.

---

**క్రొత్త పబ్లికు ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టరు:—** ఎర్లాం స్మిత్ గారు పబ్లికు ఇన్‌స్ట్రక్షన్ డైరక్టరుగా ఆర్. జి. గ్రీవ్ గారిస్థానే నియమింపబడుదురని తెలియుచున్నది. గ్రీవ్ గారు ప్రస్తుత యేర్పాటుప్రకారము 28-వ తేదినుండి సెలవు పై గొనెదరు.

---

**ఇండియన్ ఎకనామిక్సు అసోసియేషన్.—** డా॥ బి. పట్టాభిసీతారామయ్యగారు రేపు, 17 వ తేది శుక్రవారము సాయంకాలం 5-30 గంటలకు పచ్చయప్ప మందిరమందు పై సంఘము యాజమాన్యమున "ఖద్దరు యొక్క లాభములు" గూర్చి యుపన్యసింతురు.

---

**యస్. పి. సి. ఏ. సహాయార్థము సర్కస్‌హాండీ ప్రదర్శనము:—** యస్. పి. సి. ఏ. సహాయార్థము సర్కస్ హాండీయొక్క అధిపతి రేపు శుక్రవారమున రాత్రి 9-30 గం. సర్కస్ ప్రదర్శన మొసగుటకు దయతో అంగీకరించియున్నారు. ఈ ప్రదర్శనము మ్యా. జే. హెచ్. బి. జాక్సన్, ఐ. సి. యస్. గారి ఆదరణక్రిందను ముఖ్యమునను జరుగును. పై సంఘాభిమానులు చాలమంది యీ ప్రదర్శనమునకు దయచేసి యీఘనకార్యమునకు తోడ్పడెదరని యస్ పి సి ఏ గౌరవకార్యదర్శి కోరుచున్నారు

---

### త్యాగరాజోత్సవములు

చెన్నపురి, జన॥ 16 —రేపటినుండియు మైలాపూరులో జరుగు త్యాగరాజోత్సవసందర్భమున శ్రీహరికేశవ నల్లూరు ముత్తయ్య భాగవతర్, శ్రీరంగం శుకోపాచారి, పి సాంబమూర్తి అయ్యరు, టీ. సుబ్రహ్మణ్యశాస్త్రి, బుతరంగం రఘునాయకచెట్టిగార్ల వీణను, ఇతరులచేతను పాటకచేరీలును, హరికథలును జరుపబడును. ప్రవేశము టిక్కెట్ల మూలకముగనే జరుగును. రాత్రి హరికథానంతరము గాంధీనగరము సైదుపేట, ఇతరదూరస్థలములకును వెళ్లేవారల కొరకై ప్రత్యేక బస్సుల యేర్పాటు చేయబడుచున్నది టిక్కెట్లు 0-6-0 మొదలు 2-0-0 వరకును మాత్రమే యేర్పరుపబడినవి

---

### భారత మహిళాసంఘము, నెల్లూరులో ప్రచారము గావించుట

భారత మహిళాసంఘమునకు చెందిన శ్రీమతి కజిన్సు, శ్రీమతి విశాలాక్షిగార్లు ఈనెల 8, 9, తేదులందు నెల్లూరును దర్శించి, అచ్చటి మునిసిపలు ప్రాథమిక పాఠశాలలలో బాలికలకు గూడ విద్య నిర్బంధింపబడుటకు సదరు మునిసిపలు సంఘమునకొక విన్నపము గావించి, తమ విన్నపము సదరు మునిసిపలు సంఘముచే శ్రద్ధతో విచారింపబడుటకు వాగ్దానము పొందిరి. పిమ్మట వీ రిద్దరును నెల్లూరు మెటర్నిటీ ఆస్పత్రి, కోట మున్నగు స్థలములను దర్శించిరి. పిమ్మట నెల్లూరుకలెక్టరు గారిని దర్శించి, జైలునుండి విడుదల కాబడు స్త్రీలకొరకు నెల్లూరులో నొక శరణాలయము స్థాపింపబడవలెనని కలెక్టరుగారికి విన్నవించిరి. 9 వ తేది మధ్యాహ్నమున పురమందిరమందొక బహిరంగసభ జరిపి, భారత మహిళా సంఘముయొక్క శాఖను యేర్పాటు గావించిరి. ఇరువురొక సభయందు జని, స్త్రీవిద్య, బాల్యవివాహదురాచారము, మద్యపాన దురాచారము మున్నగు విషయములగూర్చి యుపన్యసించిరి.

---

బెజవాడ శ్రీ దుర్గాకళామందిరము హాలులో
17, 18-1-30 తేదులందు
## వ్యా ర భం జ ను డు
టిక్కెట్ల వివరములు:—రు. 0-8-0, 0-6-0, 0-4-0, 0-2-0.

---

**రాకపోకలు:—** నాబాన్ వాడుదేవరాజా కాలింగొడుగారు నేటిఉదయమున మద్రాసుకు వచ్చిరి. వీరు మరల నేటి రాత్రి బరోడాకు వెళ్లిరి.

సర్ ఫెస్ లెస్ బార్బరు గారు నిన్న రాత్రి కాలికట్టునకు వెళ్లిరి.

రేపు శుక్రవారమునాడు తూత్తుకుడియందు సమావేశమగు కార్మిక సభకు అధ్యక్షత వహించుటకుగాను శ్రీయుత బి. శివరావు గారు నిన్నరాత్రి మధురకు వెళ్లిరి.

హెచ్. యం. హుడ్డుగారు రాష్ట్రీ బ్యాంకింగు విచారణ సంఘాధ్యక్షులు, రా॥ బ॥ సి. వి. హాల్ గారు విచారణసంఘ కార్యదర్శి, హమీద్ సుల్తాన్ మరకాయిర్, సి. గోపాలమీనన్ డా॥ థామస్ గార్లు (సభ్యులు) నిన్నరాత్రి బళ్లారికి వెళ్లిరి.

సైజర్ జోన్సు గారు తాత్కాలిక పోష్టుమాష్టరు జనరలు నిన్నరాత్రి ఉదకమండలమునకు వెళ్లిరి.

---

### మద్రాసుశాఖ యూరోపియను సంఘపు సాంవత్సరిక విందు

మద్రాసుశాఖ యూరోపియను సంఘపు సాంవత్సరిక విందు రాబోవు ఫిబ్రవరి 13 వ తేదీని మద్రాసు జింఖానాక్లబ్బునందు జరుగును. మద్రాసు గవర్నరు గారును లేడీ బియాట్రిక్సు స్టాన్లీ గారును యీ విందున సంఘముయొక్క ముఖ్యఅతిథులుగ సన్మానింప బడుదురు. వెనుక ఇండియామంత్రిగనుండిన పీలుప్రభువున్ను గేజ ప్రభువున్ను యీసమయమున మద్రాసులో నుండునటులు తటస్థముగుటచే యూరోపియను సంఘమువారు వీర్లనుకూడ విందుకు ఆహ్వానించియున్నారు. విందుజరిగిన మీదట డాన్సు జరుగును. ఈ యేర్పాటులన్నియు కే కే మితెరెల్ గారు సంఘకార్యదర్శి చూచుకొనుచున్నారు (అ ప్రె)

---

## మద్రాసు షెరిఫ్‌గారికి విందు

### షెరిఫ్‌గారు రూ 50000 అరబిక్ కాలేజికి విరాళము నొసగుట

అంజుమను చేసిన ఒమరఖాన్ నం దుండు జామియా దారుస్ (అరబిక్ కాలేజి)వారు గత 12 వ తేదిని మద్రాసుషెరిఫ్ గారగు నవాబ్ సి. అబ్దుల్ హకీము సాహెబ్ బహదూర్ గారిని గౌరవించుటకు నొప్పదింద సంగిరి సుమారు 700 మంది. వారిలో మూర్గుకు హిందువులు. తక్కినవారెల్లరు మహమ్మదీయులు యీ విందుకువచ్చిరి. జిల్లాబోర్డుఅధ్యక్షులును తాలూకాబోర్డు అధ్యక్షులును కూడ వచ్చియుండిరి. ఉదయమున మద్రాసువిద్యార్థులకు బహుమతులు పంచిపెట్టబడెను. పిదప వృష్టాన్న భోజనము జరిగెను. మధ్యాహ్నము వ్యాయామప్రదర్శనము, ఇతర ఆటల ప్రదర్శనము జరిగెను. అనాటి కార్యక్రమము సాయంకాలము అల్పాహార విందుతోను షెరిఫ్ గారికి అభినందన పత్రము నొసగుటతోను ముగిసెను. ఈఅభినందనపత్రము రజతపేటికయందు అబ్దుల్ హకీము సాహెబుగారికి సమర్పింపబడెను. అబ్దుల్ హకీము సాహెబ్ గారు ప్రత్యుత్తర మొసగుచు సభవారు తన్ను గౌరవించినందులకు కృతజ్ఞతాపూర్వకవందనము ఒర్పించి తమకు ఆరేబిక కాలేజికి రూ 50000 విరాళ మొసగు నట్లు తెలిపిరి. అతిథులకు వందనముతో సభ ముగిసెను.

---

## జమ్మలమడుగు

జనవరి 14:— శ్రీ ఆర్యప్రకాశిక సంపాదకులగు బ్రహ్మశ్రీ ఘుడియారం చిదంబరయ్యగారు శారదావివాహనిరోధక శాసనము అశాస్త్రీయ మని వాదించుచు రాబోవు ఏప్రిలు 1 తేదినుండి శారదా వివాహశాసనమును అమలులోనికి తీసికొని రాగూడదని రాజప్రతినిధిగారిని ప్రార్థించుచు ఒక బహిరంగలేఖను నిన్నటిదినము రాజప్రతినిధిగారికి పంపియున్నారు.

కడపనుంచి ఒక విలేఖరి యిటీవల ఆంధ్రపత్రికకు వ్రాసినట్టి శ్రీయుత టి. నరసారెడ్డి బి. ఏ. బి. ఎల్. గారు భారత శాసనసభకు శ్రీయుత సి. దొరస్వామిఅయ్యంగారి స్థానమునకు పోటీచేయుటలేదని యూధిగా తెలియుచున్నది.

(ఒక విలేఖరి)

---

## మహాత్ముని, జవహర్లాల్‌ను ప్రభుత్వమువారు అరెస్టు చేసెదరా?

### చేసినచో అంతఃకలహములను మాని భారతీయు లందరు ఏకమయ్యెదరు

### శ్రీయుత ప్రకాశంపంతులుగారి హెచ్చరిక

మద్రాసు, జనవరి 16:— అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధికి ప్రకటన గావించుచు శ్రీయుత టంగుటూరి ప్రకాశం పంతులుగారు యిట్లు చెప్పిరి. వింటర్టన్ ప్రభువు, లాయిడ్ జార్జి, ఆంగ్లదేశమునందలి అభివృద్ధినిరోధక పత్రికలు భారతదేశమునందు నిరంకుశవిధానము నవలంబింపవలసిన దని బోధించుచున్నవి. గాంధి మహాత్ముని అరెస్టు చేయవలసినదని గూడ వింటర్టన్ ప్రభువు వ్రాసెను. ఇతరులు కాంగ్రెస్ మహాసభాధ్యక్షుడగు జవహర్లాల్ గారి పీక నొక్కవలెనని స్థిరనిశ్చయులై యున్నారు. ప్రభుత్వమువా రిట్టి దేదో బుద్ధిమాలిన కార్యము చేయుటకే దేశీయులు కనిపెట్టుకొని యున్నారు. ఇట్టి నిరంకుశపద్ధతులను ప్రభుత్వమువా రవలంబించుటవలననే ప్రజలందరును తమతమ భేదభావములను వీడి ఏకమగుట వీలగుచున్నది. ఇట్టి నిరంకుశపద్ధతులవలనే దేశస్వాతంత్ర్యమును గడించుటకు భారతప్రజల స్థిరసంకల్పము ప్రపంచమునకు ప్రదర్శితమగుచున్నది. ఎంతకాలములో స్వాతంత్ర్యము రావలయునను విషయమునను, కర్తవ్యాకర్తవ్యముల విషయమునను భేదభావమున్నను దేశస్వాతంత్ర్యమునకై ప్రయత్నించని భారతీయుడెవ్వడును ఉండబోడు. వింటర్టన్ ప్రభృతుల సలహాను గైకొనుట భారతదేశమును పోగొట్టుకొనుటకు నిశ్చయమైన మార్గమగును. మహాత్ముడును, పండిత జవహర్లాల్ గారును యిప్పుడు అరెస్టు కావిండు. భారతీయులందరును, ఒక్కటిగా చేరి వారియెడ నెట్లు విలచెదరో బ్రిటిషువారును, యితర దేశస్థులును చూచెదరుగాక!

### దౌర్జన్యము వృద్ధియగును

కాంగ్రెసు మహాసభయొక్క దౌర్జన్యరహిత కార్యక్రమమును ప్రభుత్వమువారు అణచివేయ జూచునప్పుడెల్ల దౌర్జన్యవాదులకు సాయము చేయుచున్నారని వారు నమ్మవలెను. ఈ దౌర్జన్యవాదులకు కాంగ్రెస్‌సభ యనినను ప్రజలనినను ప్రభుత్వమనినను భేదభావము లేదు.

మితవాదులను పెంపొందించి తమ పక్షమునకు తీసికొనుపద్ధతియు కాంగ్రెస్‌వారిలో గలభేదములను వృద్ధిచేయుపద్ధతియు మాని ప్రజల కోర్కెలను సఫలపరచి ప్రభుత్వమువారు జనసామాన్యముయొక్క మంచిని సంపాదించుకొనెదరుగాక.

---

మనమోహనసింగుగారు తన విమానమును మరమ్మతుకు ఢిల్లీకొరకు పంపిరి.

---

## నోటీసు

### బెజవాడ గాంధినగరములో నివేశనస్థలములు

పుయ్యూరు యెస్టేటువారికి చెందిన పూరువాహునుసద్దనున్న నివేశనస్థలము సుమారు 3-0 లు సుమారు 50 గజముల చొప్పున పీలైన లాట్లుగా ది 20-1-30 తేదీనుండి ప్రతిదినం పుదయం 7 ఘంటలనుండి 11 ఘంటలవరకు, సాయంత్రము 4 గంటలనుండి 6 ఘంటలవరకు బ్రాహ్మణపురములో వేలం వేయబడును

ముఖ్యగమనింపు —ఇతర వివరములు తెలిసికొనగోరువారు, దేవరాజ కృష్ణమూర్తిగారు, పూలబావివీధి బెజవాడ వద్ద తెలిసికొనవచ్చును

పుయ్యూరు యెస్టేటు,
నూజివీడు

అంగర లక్ష్మీపతిరావు,
పెర్సనల్ అసిస్టెంటు,

## శాసనసంఘ సభ్యతలకు కాంగ్రెసువారి రాజీనామాలు

### మధ్యరాష్ట్రీయులలో నిక నలుగురుమాత్రమే రాజీనామాల నియ్యవలెను

ఈనెల 14 వ తేదీవరకు 13 మంది రాజీనామాల నిచ్చిరి. ఇక 4 గురు మాత్రమే రాజీనామాల నియ్యవలెను. (అ. ప్రె.)

### బర్మా శాసనసభ

కాంగ్రెసువారి తీర్మానము ననుసరించి బర్మా శాసన సంఘ సభ్యతకు యిప్పటివరకు ఎస్. ఎ. యస్. త్యాబ్జీగారొక్కరే రాజీనామా నిచ్చిరి. (అ. ప్రె.)

### బీహారు శాసనసభ

ఇపుడు క్రొత్తగా రామనంద్రసింగు రామేశ్వర నారాయణ అగర్వాలా, లింగరాజ మిశ్రగార్లు కూడ రాజీనామాల నిచ్చిరి. వీరితో మొత్తము 14 గురు రాజీనామాల నిచ్చిరి. (ఫ్రీ ప్రెసు)

### వంగరాష్ట్రీ శాసనసభ

ఇప్పటికి 30 మంది రాజీనామాల నిచ్చిరి. మార్చి నెల 15 వ తేదీలోగా నియోజకులు క్రొత్తవారి నెన్నుకొనవలెను. అభ్యర్థుల పేర్లను సూచింపగోరువారు యీ జనవరి నెల 29 వ తేదీలోగానే తెలుపవలెను. ఈ నెల 30 వ తేదీని సూచనపత్రములు పరిశీలింపబడును. నూతన నియోజక పట్టికల ప్రకారము ఎన్నికలు జరుగును. అని వంగరాష్ట్ర ప్రభుత్వము వారు నిన్న 15 వ తేదీని గెజెటులో ప్రకటించిరి. (అ. ప్రె.)

### ఆర్. శ్రీనివాసయ్యంగారు-గూడలూరు

"నేను కాంగ్రెసు ప్రతినిధిగా ఎన్నికలకు నిలచితినిగాన రాజీనామా నిచ్చితిని. నేను మరల నే ఎన్నికలకును నిలువదలచుకొనలేదు." అని వీరు చెప్పిరి.

### కర్నాటక సభ్యులు

"డాక్టరు యం. రామారావుగారు స్టేటు కౌన్సిలుకును, జి.వి. జోషీగారు భారత శాసనసభకును రాజీనామాలును పంపినట్లు కర్నాటక రాష్ట్రీయ కాంగ్రెసుసంఘ కార్యాలయమునకు వ్రాసిరి. కే. ఆర్. కరంతుగారుకూడ చెన్నపురి శాసనసభకు రాజీనామా నిచ్చిరని తెలిసినది గాని వారింకను మాకు వ్రాయలేదు. ఈ నెల 6 వ తేదీని అందరికిని లేఖలను వ్రాసితిని. ఇతరుల కడనుండి యింకను ప్రత్యుత్తరములు రాలేదు. జె. ఏ. సాల్దానా (చెన్నపురిసభ), వి.ఆర్. నాంగు, డి.ఆర్. కార్కి, (బొంబాయిసభ) గార్ల వద్దనుండియు కరంతుగారి యొద్దనుండియు లేఖలు రావలసియున్నది" అని రాష్ట్రీయ కాంగ్రెసుసంఘ కార్యదర్శి యీనెల 14 వ తేదిని ధార్వారునుండి ప్రకటించెను. (ఫ్రీ ప్రెసు.)

### శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు

"నేను శాసనసభలబహిష్కారము నామోదింపజాలను. నేను నా నియోజకవర్గ ప్రాంతములం దంతటను సంచారముచేసి చాలమందిలో నాలోచించితిని. కాని, నా అభిప్రాయము మే స్థిరపరుపబడెను. మహసభవారి సభ యీనెల 19 వ తేదీని జరుగును. ఆసభలో రాజీనామాలవిషయ మాలోచింపబడును గాన నే నింకను రాజీనామా నియ్యలేదు. నేను మరల ఎన్నికలకు నిలువగోరను." అని వీరు ప్రకటించిరి. (అ. ప్రె.)

### పిల్లలమఱ్ఱి ఆంజనేయులుగారికి విన్నపము

శ్రీయుత పిల్లలమఱ్ఱి ఆంజనేయులగారికి:—వందనములు. మీరు కాంగ్రెసు వోటింగుతో మాయొక్క కాంగ్రెసు గ్రామ సభ్యుల సహాయముతో మద్రాసు కౌన్సిలునకు సభ్యులుగా బోయి యిప్పుడు మేము నమ్మిన కాంగ్రెసు తీర్మానానుసారము తాము సభ్యత్వమునకు రాజీనామా నీయకపోవుట కాంగ్రెసు సభ్యుల కందరికిని అవమానము. ముంబైనను మహాత్ముని స్వాతంత్ర్యపోరాటమున తమబోటివారు పాల్గొనదరని నాతోనే తమకు ఓటిచ్చితిమి.

(చేబ్రోలు వోటరు).

## గుంటూరు మాచర్ల రైలుమార్గము

### 15 వ తేదినుండి టిక్కెట్లు అమ్మబడుచున్నవి

గుంటూరు, జనవరి 15:—నేటిదినము ఉదయం 6 గంటలనుండి ఈ నూతన రైలుమార్గమున అన్ని స్టేషనులకు టిక్కెట్లు అమ్ముటకు రైల్వేకంపెనీవారు ప్రారంభించిరి. రెండు దినములు డిపార్టుమెంటుల అధికారులు పరీక్షచేసి రైలునందు ఏట్టి లోపము లేదని బండ్లు నడుపుటకు తీర్మానించిరి. ఫిబ్రవరి నెలలో గవర్నరుగారు గుంటూరునకు వచ్చినప్పుడు గవర్నరుగారు ప్రారంభమహోత్సవము జరిపెదరు. (అ. ప్రె.)

## భారతశాసనసభ

### రాజీనామాలవిషయమై గజెటు ప్రకటన

ఢిల్లీ, జనవరి 11:— భారతశాసనసభ్యులలో టి. ప్రకాశం, మోతీలాలు నెహ్రూ, లాల హన్సరాజ్, జమ్నాదాస్ మెహత, రాయిబహదరు అమలు ముకర్జి, ఇ. హెచ్. యం. బవరు, వి. జె. కోగర్కర్ గార్లు తమ సభ్యత్వములకు రాజీనామాలను పంపిరనియు వీరి రాజీనామాలు అంగీకరింపబడిన వనియు ఈ వారపు ఇండియా గజెటునందు ప్రకటింపబడినది. (వీరిలో కడపటి మగ్గురు అధికార సభ్యులు) మహేంద్రప్రసాదుగారు స్టేటు కౌన్సిలు సభ్యత్వమునకు రాజీనామా ఇచ్చిరనికూడ ప్రకటింప బడినది.

యస్. హెచ్. స్లేటరు, హెచ్. ఏ. సామ్యుయల్, రాజనారాయణ బెనర్జిగార్లు (అధికారసభ్యులు) భారతశాసన సభ్యులుగ నియమింపబడిరనికూడ ప్రకటింపబడినది. (అ. ప్రె.)

## భారత శాసనసభ ఆర్థిక స్థాయిసంఘసమావేశము

### సైమనుకమిషను స్పెషలు డిపార్టుమెంటును మరికొంతకాల ముంచవలయునని తీర్మానింపబడుట

ఢిల్లీ, జనవరి 15:—నేటిదినము భారతశాసనసభ ఆర్థిక స్థాయిసంఘ సభ్యుల సమావేశము జరిగినది. సైమనుకమిషను వారికి తోడ్పడుటకై స్పెషలు డిపార్టుమెంటు ఏర్పరుపబడెను. ఏప్రిలు నుండి ఈ డిపార్టుమెంటువారికి పని అధికముగ నుండుననియు ఈ డిపార్టుమెంటును కొంతకాలము వరకు తీసివేయకూడదనియు ప్రభుత్వమువారు సూచించిరి. ఈ డిపార్టుమెంటునకు ఖర్చు లక్ష 55 వేలు. ఈసూచనను స్థాయిసంఘసభ్యులలో అధికసంఖ్యాకులు ఆమోదించిరిగాని అమరనాథదత్తు పయ్యదుము ర్తుజా సాహేబు మహమ్మదు ఇస్మేలుగార్లు ఆక్షేపించిరి.

భారత శాసనసభ నాయకుని సహాయ మొసగుటకై హోం డిపార్టుమెంటునం దొక ప్రత్యేకోద్యోగిని నియమింపవలయునని ప్రభుత్వమువా రొకసూచన గావించిరి. హోం మెంబరు ఎగ్జిక్యూటివు కౌన్సిలు సభ్యత్వమునకు సంబంధించిన పనులను చూచుకొనుటయేకాక భారత శాసనసభానాయకుని ధర్మములనుకూడ నిర్వహింపవలసి యున్నది. సభానాయకుని ధర్మములను నిర్వహింప తోడ్పడుటకు ఈ ప్రత్యేకోద్యోగ నియామకము అవసరమగుచున్నది. ఇతనికి నెలకు 2250 రూప్యముల జీత మివ్వబడును. భారత శాసనసభా సమావేశములు లేనప్పుడు వీరు ఇతర రాష్ట్రములందు పర్యటన మొనర్చుచు అప్పటి ప్రజాభిప్రాయమును సు గ్రహించుటకై పనిచేయుచుందురు. రెండు సంవత్సరముల జీతమును అంగీకరింపవలయునని ప్రభుత్వమువారు కోరిరిగాని స్థాయిసంఘమువారు ఒక సంవత్సరపు జీతపు ఖర్చునుమాత్రమే మంజూరుచేసిరి. (అ. ప్రె.)

## లేబరు కమిషను ఖర్చులు

### 13 1/3 లక్షల రూప్యముల గ్రాంటు

ఢిల్లీ, జనవరి 15:—మొన్నటిదినము జరిగిన ఆర్థిక స్థాయిసంఘసమావేశమున లేబరు రాయలుకమిషను ఖర్చులక్రింద ఈ సంవత్సరము 5 1/3 లక్షలు రాబోవు సంవత్సరమునకు 7 లక్షలు ఆమోదింపబడెను. (ఫ్రీ ప్రెస్)

ఢిల్లీ, జనవరి 10:—భారతశాసనసభ ఆర్థికస్థాయిసంఘమువారు నేటిదినము సమావేశమై ఢిల్లీ విశ్వవిద్యాలయము వారికి వాగ్దానముచేయబడిన లక్షరూప్యముల గ్రాంటులో ఈ సంవత్సరము 25 వేల రూప్యముల నిచ్చుటకు అంగీకరించిరి.

పెషావరునందు వైద్యశాలకై ఇంతకుముందు ప్రభుత్వము వారు 85 లక్షల గ్రాంటు ఇచ్చియుండిరి. ఈవైద్యశాల నిర్వహణ బాధ్యతను ఇండియా ప్రభుత్వమువారే వహింపవలయునని తీర్మానింపబడెను. వివరములను నిర్ణయించుటకు ఉపసంఘ మేర్పరుపబడినది. (అ. ప్రె.)

### శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరులవారి పర్యటన

పై కనుపబడిన యోగీశ్వరులవారు పలాసనుండి సోంపేట ఇచ్ఛాపురం, బరంపురం, అస్కా, రసూలుకొండ మొదలగు గ్రామములకు వెళ్లి అనేక దేవరహస్యములు సంశయానాదు రోజులు ఉపన్యాసము చేసిరి. 16 వ తేదీన బరంపురంలో నుండి తమలందరి ఛత్రపురమునకు వెళ్లి అచ్చటను మూడురోజులు ఉపన్యాసము చేయబోవుచున్నారు. అచ్చట ఉపన్యాసము చేసి కురదారోడ్డు వెళ్లబోవుచున్నారు.

ఇరదల లక్ష్మీనారాయణ ఆసిరా,

## పూర్వ ఆఫ్రికా సమస్య

### పండిత కుంజ్రుగారి ప్రకటన

అలహాబాదు, జనవరి 13 —పూర్వ ఆఫ్రికా భారతీయుల రాయబారమునకు నాయకుడుగ ఇంగ్లండునకు వెళ్లిన పండిత హృదయనాథ కుంజ్రుగారు కడచిన శనివారము అలహాబాదుకు వచ్చి చేరిరి. పండిత కుంజ్రుగా రీక్రింది ప్రకటనము గావించుచున్నారు:—

పూర్వ ఆఫ్రికా భారతీయుల సమస్య, భారతసమస్యలలో ప్రధానమైనదని మనము బ్రిటిషువారికి స్పష్టపరుపవలెను. పూర్వ ఆఫ్రికా సమస్యను ప్రభుత్వమువారు తృప్తికరముగ పరిష్కరింపనిచో భారతదేశమున తీవ్రమగు అశాంతి వ్యాపింపగలదు. పూర్వ ఆఫ్రికా భారతీయులు కేవలము న్యాయమును సత్యమును కోరుచున్నారు. సమానహక్కులను కోరుచున్నారు. ప్రత్యేక నియోజకవర్గములు అంతమొందుట అవసరము. (అ. ప్రె.)

## ఫోర్టు సెంటుజార్జి గెజట్టు

### 14—1—1930

#### పబ్లికుశాఖ

హెచ్. ఏ. బి. వర్మాన్‌గారు ఎగ్జామినర్సు బోర్డు ప్రెసిడెంటుగా సి. బి. కాటరిల్‌గారి స్థానే నియమింపబడిరి

వి. రాజగోపాలన్‌గారు గంజాంజిల్లా, శ్రీకాకుళం డివిజనుకు సబ్‌కలెక్టరుగా నియమింపబడిరి

#### రివిన్యూ అండర్ సెక్రటరీ

మాక్ ఇవాన్‌గారు రెండువారములు సెలవులోనుండు కాలములో వారిస్థానే రా॥ బ॥ ఏ వి వెంకటరామయ్యరుగారు నియమింపబడిరి వీరు ప్రస్తుతము సైదాపేటలో ట్రెజరీ ట్రెయినింగు పొందుచున్నారు.

#### న్యాయశాఖ

మహంకాళి సుబ్రహ్మణ్యంగారు రాజమండ్రి రెండవ మేజస్ట్రేటుగా నియమింపబడిరి

#### రివిన్యూశాఖ

డి నారాయణరావుగారు వెల్లూరు జనరలు డిప్టీకలెక్టరుగాను, ఎస్ కోయిల్‌పిళ్లెగారు అనంతపురం జనరలు డిప్టీకలెక్టరుగాను నియమింపబడిరి

#### పబ్లికువర్క్సు శాఖ

ఎ అయ్యాదురై అయ్యరుగారు ఎగ్జిక్యూటివు యింజనీరుగా కృష్ణా డెల్టా ఇన్‌వెస్టిగేషను డివిజనుకు (బెజవాడ సర్కిలు)

ఆర్ అప్పాదురై అయ్యంగారు గోదావరి వర్క్సుడివిజనుకు (ధవళేశ్వరం సర్కిలు)

ఎస్. దురైరాజయ్యరుగారు ఉత్తర రాజధాని డివిజనుకు (మద్రాసు సర్కిలు) నియమింపబడిరి

#### స్థానిక స్వపరిపాలనశాఖ

ఈ క్రిందివారు మున్సిపలు కౌన్సిలరుగా అయానర్యులకు ప్రభుత్వమువారిచే నియమింపబడిరి —మిస్ గ్రేస్ వేదాంతదారిగారు కర్నూలు శ్రీమతి రామసుబ్బమ్మగారు కడప బి. శంకరశాస్త్రిగారు శ్రీకాకుళం.

మిస్ గుమ్మడిదల దుర్గాబాయిగారు తూర్పుగోదావరి జిల్లాబోర్డుకు సభ్యురాలుగా ప్రభుత్వమువారిచే నియమింపబడిరి.

డి. నారాయణరాజు (భీమవరం తాలూకాబోర్డు ప్రెసిడెంటు) గారు సదరుతాలూకాబోర్డు సరిహద్దులో పంచాయితుల అర్గనైజరుగా నియమింపబడిరి

పి. తిరుమలరెడ్డిగారు శ్రీకాకుళం తాలూకాబోర్డుకు వైస్‌ప్రెసిడెంటుగా ఎన్నుకోబడిరి.

జుడిషియల్ శాఖ మాడభూషి లక్ష్మీనారాయణాచారిగారు గంజాంజిల్లా కోర్టు శిరస్తాదారు పదవినుండి గురకాలమునసబుకోర్టుకు జిల్లామునసబుగా నియమింపబడిరి

వ్యవసాయశాఖ వై జి. కృష్ణరావు నాయుడుగారు జిల్లా వ్యవసాయోద్యోగిగా నంద్యాలనుండి బళ్లారికి, ఎం. వీరరాఘవ రావుగారు బళ్లారినుండి నంద్యాలకు, బదిలీచేయబడిరి

#### వైద్యశాఖ

మిస్ కామన్ అప్పమ్మ ఎల్. ఎం ఎస్. గారు మద్రాసు మెడికలు కాలేజి లేడీ ట్యూటరుగాను, స్త్రీల హాస్టెల్ వార్డెన్‌గాను, నియమింపబడిరి.

మద్రాసు మెడికలు కాలేజి లేడీ అసిస్టెంటు సర్జను, లేడీ ట్యూటరు, స్త్రీల హాస్టెల్ వార్డెన్‌గానుండిన మిస్ కే. ఎం ఖాన్ గారి యుద్యోగ కాలపరిమితి 12-12-29 తేదిని అంతమొందెను

# కార్యాచరణమునకు సమయ మేగుదెంచినది

## 'బెంగాలీలు తమ విధ్యుక్తమును నెరవేర్పవలెను'

### పండిత మోతీలాల్ నెహ్రూగారి యుద్బోధనము

కలకత్తా, జనవరి 15:—ఈ రోజు రాత్రి కలకత్తా నుండి పాట్నా వెళ్లుచు శ్రీయుత పండిత మోతీలాల్ నెహ్రూగారు పత్రికలకీ క్రిందిప్రకటనమును గావించెను:—

కలకత్తాలో మనము చేసిన వాగ్దానమును లాహోరు జాతీయ మహాసభ సఫలపరచినది. కలకత్తాలో నిర్ణయింపబడిన వేదిక విజయవంతమై యొప్పుచున్నది. లాహోరులో గావించిన తీర్మానము కొనసాగునట్లు చేయుట వంగరాష్ట్రము యొక్కయు, యితర రాష్ట్రముల యొక్కయు కర్తవ్యమై యున్నది.

1929 సంవత్సరము 31 తారీఖున నిశీథము 12 గంటలు దాటినతరువాత సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతీయుల యాశయమనియు, దానిని సాధించుటకు శాసనోల్లంఘనమే మార్గమనియు లాహోరు కాంగ్రెస్ మహాసభ తీర్మానించినది. లాహోరు తీర్మానముల యనంతరము జాతీయ పోరాటము నూతన మార్గమునబడినది. ఈమార్గమున మన కోర్కెలు సఫలమగుటకు దేశములోని సర్వశక్తులను ఏకముఖము గావింపవలెను. వాదమునకు, తర్కమునకు యిది తరుణము కాదు. కార్యాచరణమునకు సమయ మేగుదెంచినది. కావున లాహోరు తీర్మానములయందలి లోపాలోపముల విషయమై చర్చయంతయు మాని కాంగ్రెస్ మహాసభవారి యాజ్ఞలను విశ్వాసముతో శిరసావహించెదరని నేను కోరుచున్నాను.

లాహోరు కాంగ్రెస్‌వారి కార్యక్రమము అనిశ్చితముగానున్నదను వారి వాదములనుగూర్చి చెప్పుచు వారు కార్యక్రమము అసమగ్రమేయని యొప్పుకొనుచున్నారు. కాని కార్యరంగములోనికి దిగకముందు కార్యక్రమ మంతయు చర్చకు వదలిపెట్టుట వీలుకాదని వారు స్పష్టముగా తెలియజేయుచున్నారు. తత్క్షణము అవలంబింపవలసిన విధానమును ప్రజ తెలిసిన చాలును. దానిని ఉత్సాహముతోడను, దీక్షతోడను వారు కొనసాగింపవలెను.

### స్వాతంత్ర్యదినోత్సవము

ఈ నెల 26 తారీఖు స్వాతంత్ర్యదినోత్సవముగా నిర్ణయింపబడినది. స్వాతంత్ర్యయత్నమునందు ప్రథమసోపానమగు నిది చాలసరళమైనది. శాంతిప్రదమైనది. వినను యిది ప్రజలశక్తిసామర్థ్యములను ప్రదర్శించును. ఇంతకంటె తీవ్రమగు యత్నములను ప్రారంభించుటకు ప్రజలు సన్నద్ధులై యున్నారో, లేదా యనువిషయము యీ ఉత్సవముయొక్క జయాపజయములమీద నాధారపడి యుండును. ఈ ఉత్సవమును జయప్రదముగా కొనసాగించుటకు అందరును ప్రయత్నించవలెను.

### మహాత్మునిపై విశ్వాసముంచుడు

సర్వసేనాధిపతియగు గాంధిమహాత్ముని యందు విశ్వాసముంచి వారియాజ్ఞలకై వేచియుండుడు. ఇట్లు చేసితిరేని స్వాతంత్ర్యమునకై దీర్ఘకాలము వేచియుండ నవసరము లేదని నేను నిశ్చయముగా చెప్పగలను.

---

### బెంగాలు కాంగ్రెసు ఎన్నికలతగాదా

కలకత్తా, జనవరి 16:—బెంగాలు కాంగ్రెసు ఎన్నికలతగాదా విచారణను నిన్నటిదినము పండిత మోతీలాలు నెహ్రూగారు ముగించిరి. పండితుడు అలహాబాదునకు వెళ్లి అచ్చటనుండి తీర్పును ప్రకటించెదరు. కడపటివరకుకూడ రాజీకు దుర్చుటకై ప్రయత్నములు జరిగెనుగాని లాభము లేకపోయెను. కార్యనిర్వాహక వర్గమువారు తమ అధికారమును దుర్వినియోగ మొనర్చిరను ఆరోపణను రుజువుచేయవలయునని పండిత నెహ్రూగారు కోరగ జె. ఎం. గుప్తగారు తన వాదమును రుజువుచేయు లేఖ నొకదానిని చూపిరి. కార్యదర్శి ఆలేఖ కృత్రిమమైనది కాదని అంగీకరించిరి. (అ. ప్రె.)

# శ్రీ కుసుమ హరినాథ ఆనంద మేళోత్సవము

## ఈనెల మొదటి తేదిని ద్వారకా తిరుమలలో జరుగుట

దీనినిగూర్చి ఆంధ్ర పత్రికలో ప్రచురింపబడుటచే శ్రీ హరినాథ బాబావారిపట్ల భక్తి గలవారందరును వ్యయప్రయాసలను లెక్కచేయక పలుతావులనుండి 1, 2 రోజులు ముందుగానే ద్వారకా తిరుమలకు వచ్చిరి. శ్రీయుతులు టెక్కలిలో సబురిజిష్ట్రారు చెలికాని ధర్మారావు, బరంపురంలో పోలీసు సబు యినస్పెక్టరు జయరాంసింగు, పాలకొండలో సబురిజిష్ట్రారు పి. సూర్యారావు గుంటూరులో వకీలు హనుమంతరావు పంతులు గార్లు మున్నగువారు సుమారు 300 మంది ఆంధ్రదేశము నందలి పెక్కు తావులనుండి సభకు వచ్చిరి. 35 గంటల సేపు ఏకధాటిని భజన జరిగినది. వచ్చినవారిలో సగముమంది స్త్రీలుగూడ కలరు. బాబాగారి ఉపదేశమునుగూర్చి సభలో టి. వి. దేవరగారు (ధవళేశ్వరం) ప్రేమామృతమును ప్రవహింపజేయుచు గంభీరోపన్యాసము నొసగిరి. ద్వారకాతిరుమలలో హరనాథాశ్రమమునకు లేక భజనమందిరమునకు అనుకూలమగు భవనమును నిర్మించియిచ్చుటయే గాక యీసమావేశమును జయప్రదముగా కొనసాగించుటకు అత్యధికమగు శ్రద్ధనుగూడ బూనిన శ్రీయుత వడ్లపట్ల సింగరాజు శర్మగారి నీసభవారెంతయు ప్రశంసించిరి. వారు శ్రీబాబాజీ అనుగ్రహమునకు పాత్రులగుదురుగాక యని కోరిరి. వచ్చినవారి కందరికిని సకలసదుపాయములను సమకూర్చిన శ్రీయుతులు పూర్ల రామచంద్రయ్య, పూర్ల సుబ్బారావు, అదూరి సత్యనారాయణ, దుర్గా మల్లికార్జునరావు, పి. సీతారామయ్య గార్లు మున్నగువారని సభవారభినందించిరి. ఇందునిమిత్తము చందాల నిచ్చినవారి పేర్లు వచ్చు రాంతమున నివేదికలో ప్రకటింపబడును.

"ఈ భవనమును అహర్నిశలు ఎడతెగకుండ భజన జరుగుచుండుటకును వచ్చినవారికి అన్నదానము జరుగుటకును తగినయేర్పాటులను చేయుట కొక ఉపసంఘమును ఈ భవనమునకు ధర్మకర్తలును ఏర్పడవలెను. దీనికి ముఖ్యకోరకులు పూర్ల గ్రామస్థులేగాని యీ సంఘము పూర్లలోనే యుండవలెను." అని తీర్మానింపబడెను.

ఈ భవనమునకు ధర్మకర్తల(ట్రస్టీలకేర) దానపత్రమును వ్రాసిరి. రిజిష్ట్రీరు చేయింపవలెను. లింగరాజు శర్మగారినికోరగా వారంగీకరించిరి. ఈమందిరమును మరామతు చేయుటకు సభలో సుమారు 150 రూ॥లు వసూలైనవి. ముగ్గురుచేరి 10 రూపాయలును 31 మందిచేరి 5 రూపాయలు నిచ్చిరి. ఇంతవరకును తటస్థులుగా నున్న ద్వారకా తిరుమల వాస్తవ్యులు 12 మంది యీ సభ జరుగగానే సంతోషపూర్వకముగా నీసంఘములో చేరిరి. స్వర్గీయ భోగరాజుగారి దత్తపుత్రుడు శ్రీయుత జానకిరావు (15 ఏండ్ల వయసు) గారు బాబాజీని కీర్తించుచు పంచరత్నములను వ్రాసి సభలో చదివిరి" అని యొకరు మాకువ్రాసిరి.

---



# ప్రస్తుతరాజకీయపరిస్థితులు

## రాజమహేంద్రవరములో దివాన్‌బహద్దరు బొల్లిని మునిస్వామినాయుడుగారి ఉపన్యాసము

(స్వకీయవిలేఖరి)

జనవరి 10:—ది జ్యాబిలి కిసింహయాను యాజమాన్యమున జస్టిసుపక్షనాయకులగు దివాన్‌బహద్దరు బొల్లిని మునిస్వామినాయుడుగారు "ప్రస్తుత రాజకీయపరిస్థితులు"నుగూర్చి ది 8-1-30 తారీఖున వీరేశలింగపురమందిరములో గంభీరోపన్యాసమును గావించిరి.

లాహోరుకాంగ్రెసుతీర్మానములగూర్చి ముచ్చటించుచు దేశము, జనసామాన్యము సంపూర్ణ స్వాతంత్ర్యసంపాదనకై అవసరమగు కష్టములను అనుభవించుటకు సిద్ధముగా లేదనియు, అట్టిపరిస్థితులలో శాసనసభలను బహిష్కరింపరాదనియు నుడివిరి. మహాత్మునితో ఏకీభవింపలేకున్నను వారిని ఎన్నడు నిందింపననియు, వారియెడ తనకు గౌరవ మున్నదనియు పలికిరి. గాంధి- ఇర్వినులమధ్య జరిగినరాయబారములు, రాజీనామా కబుర్లు అఖిరయినందులకు విచారమును తెల్పిరి. కాని గొండు టేబిలు సమావేశములో అన్నిపక్షములవారు అంగీకరించిన ప్రణాళికను బ్రిటీషు మంత్రివర్గమువారును, బ్రిటీషు పార్లమెంటువారును తగినవిధమునఆలోచించి న్యాయముచేయుదురని ఇర్విను ప్రభువుగారు చెప్పినమాటలలో సబబు గలదనిరి. రౌండు టేబులు సమావేశములో బ్రిటీషువారు డొమినియన్ స్టేటసును అంగీకరింపనిచో మితవాదులు, జస్టిసుపక్షనాయకులు కూడ అతివాదులగుదు రనిరి.

హిందూదేశ సహాయకార్యదర్శి రసెలుగారి ఉపన్యాసమును ఖండించుచు వారిభావముచే బ్రిటీషు మంత్రివర్గమువారి అభిప్రాయమైనచో రౌండుటేబిలు సమావేశమునకు ఏపక్షమువారును వెళ్లవలసిన అగత్యముండదనిరి. వెళ్ల నవసరము లేదనిరి.

భారతదేశములో ప్రస్తుతము రాజకీయకక్షలు మూడున్నవనియు, అందు మొదటికక్షవారు సంపూర్ణస్వాతంత్ర్యమును శాసనసభాబహిష్కారమును కోరుచున్నారనియు, రెండవపక్షమువారు సంపూర్ణస్వాతంత్ర్యవాదులయ్యు శాసనసభలను బహిష్కరింపరాదనుచున్నారనియు, మూడవవారు డొమినియన్ స్టేటసును, శాసనసభలను అంగీకరించుచున్నారనియు నుడివిరి. రెండు, మూడుపక్షములమధ్య భేదము అల్పమనిరి. రెండవవారు వాఙ్మాత్రమున మాత్రమే స్వాతంత్ర్యవాదు లనిరి. ఒకవైపు పూర్ణస్వరాజ్యమును కోరుచు శాసనసభలలో ప్రవేశింపజూచుట అక్రమమనిరి. ఇట్టి కుతంత్రములతో ప్రజలను మోసపుచ్చుచున్నారనిరి.

ఉపన్యాసమును ముగించుచు బ్రిటీషు దొరతనమువారికిది సందిగ్ధసమయమనియు, వారి పలుకులు నమ్మదగినవో కావో తెలియవలసినసమయమే తెంచినదనియు, వారి మాటలకు చేతలకు సంబంధమున్నచో రౌండుటేబిలు సమావేశములో డొమినియన్ స్టేటసును భారతదేశమునకు తక్షణమే యిచ్చుటకు అంగీకరింపవలసి యున్నదనియు నుడివిరి. మితవాదులను అతివాదులను చేయవద్దనిరి.

తరువాత బి. విశ్వనాథదాసు యం. యల్. సి. గారు మాట్లాడుచు లాహోరుకాంగ్రెసులో ఆమోదింపబడిన సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానమును, శాసనసభాబహిష్కారమును ఖండించిరి. అంత వందనములతో సభ ముగిసెను.

### తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసు సంఘము కార్యనిర్వాహకసభ

జనవరి 10—అమలాపురములో కో-ఆపరేటివు సెంట్రలు బ్యాంకి ఆఫీసులో సాయంకాలము 5 గంటలకు తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసుసంఘ కార్యనిర్వాహకసభ సమావేశమయ్యెను. మ-రా-రా వెన్నేటి సత్యనారాయణగారు అధ్యక్షత వహించిరి. ఈక్రింది తీర్మానములు ఆమోదింపబడెను.

(1) కళా వెంకట్రావుగారిని రాబోవు లోకలు బోర్డు యెన్నికలలో అమలాపురం ఫిర్కాకు కాంగ్రెసు అభ్యర్థిగా నియమించవలెనైనది.

(2) జిల్లా కాంగ్రెసు కమిటీ మీటింగు వెంటనే జరుపుటకు తీర్మానించడమైనది.




# నిర్బంధగర్జనము

నిర్బంధగర్జనము నలుదిక్కుల ప్రతిధ్వనించు చున్నది. కన్సర్వేటీవు ప్రభుత్వమునందు కాలనీలమంత్రిగ నున్న జిక్సు అనునామాంతరము గల సర్ జాయిసను హిక్సుగారికేక యీసమయమున వినిపించుచున్నది. వీరు చిరకాలమునుండియు హిందూదేశమునకు ప్రబలశత్రువులుగ ప్రవర్తించుచు, భారతీయుల కెట్టిహక్కుల నొసగగూడ దని పార్లమెంటుసభలో వాదించుచుండెడివారు. సిడ్నేహాం ప్రభృతులతో చేతులు గలుపుచుండెడివారు. వీరు మంత్రిపదవిని వహించినపిమ్మటగూడ, హిందూదేశమును బ్రిటీషువారి వాణిజ్యలాభమునిమిత్తమే పరిపాలింపవలయుననికూడ బహిరంగముగ చాటియుండిరి. జిక్సుగా రిపుడు బ్రెంటుఫర్డుప్రభువుగా రయిరి. వీరు డెయిలీమెయిలుపత్రికకు వ్రాయుచు, హిందూదేశమునందు బయలుదేరెడి తిరుగుబాటును బలముతో నణచివేయవలయు నని, ఎచ్చరించుచు వ్యాసమును వ్రాసిరి. లాయడు జార్జిగారు కన్సర్వేటీవులతోపాటు, హిందూదేశముపట్ల శత్రుత్వమును సాధించుచున్నారు. వీరికిని డెయిలీమెయిలు పత్రికయే శరణ్యమయ్యెను. రౌండు టేబిలు సమావేశము అధినివేశస్వాతంత్ర్య మిచ్చునన్నుభ్రాంతిని భారతీయులలో కల్పించినందులకు, లాయడుజార్జిగారు ఇండియామంత్రియగు వెడ్జివుడ్డు బెన్నుగారిని నిందించుచున్నారు. పార్లమెంటు సభలో, ఎట్టిమార్పు గలుగదని చెప్పి, భారతీయులలో వేరొకరీతి భ్రాంతిని గలిగించుట అక్రమమన్ని, లాయడుజార్జిగారి యుద్దేశ్యము.

శతాబ్దములకొలదియనుభవము కావలసి యుండ, పదిసంవత్సరములలో భారతీయులకు స్వపరిపాలనశిక్షణ మెటుల గలిగెనని, వీ రడుగుచున్నారు. సంపూర్ణస్వరాజ్యము గాని, అధినివేశస్వాతంత్ర్యము గాని, త్వరలో సాధ్యపడ దని వీరితలంపు. వెంటనే అధినివేశస్వాతంత్ర్యము నిచ్చుటకన్నను, సంపూర్ణస్వాతంత్ర్యము నిచ్చుటయేమేలన్ని, లాయడు జార్జిగారు హితవొసగుట జూడ, బ్రిటీషుప్రముఖులు బుద్ధిపూర్వముగ అధినివేశస్వాతంత్ర్యము నిచ్చుటకయినను సమ్మతింప రని విదితమగుచున్నది. లేబరు మంత్రియగు రస్సెల్లుప్రభువుగారును ఇటులనే పలికియుండిరి. ఈవిషయమున కన్సర్వేటీవు, లిబరలు, లేబరుపక్షములమధ్య ఎంతదగిన భేదము గనుపింపదు. అందుచే, అధినివేశస్వాతంత్ర్యమును వాంఛించు మితవాదు లికనయినను, ప్రజాశక్తివలనగాని తమకోర్కె లీడేర వని గ్రహించి, కాంగ్రెసుతో చేతులుగలిపి పాటుబడుట లాభకరము. మితవాదుల ఎసబాటు నాధారముగ గైకొనియే, లాయడుజార్జి ప్రభృతులు మరింతగ చెలరేగుచున్నారు. కాంగ్రెసుకార్యక్రమమును ప్రభుత్వ మేమాత్రము సహింప దని వెంటనే ప్రకటింపవలయు నన్ని, లాయడుజార్జిగారు కేకలిడుచున్నారు. ఇంగ్లండులో బయలు దేరినధ్వని, హిందూదేశమునందును ప్రతిధ్వనించు చున్నది.

రాష్ట్రపాలకులు చెలరేగుచున్నారు. బర్మా క్రేడు సంఘమునందు ముచ్చటించుచు, లాహోరు కాంగ్రెసు తీర్మానములను బర్మా గవర్నరుగారు పూర్తిగ నిరసించిరి. అహింసాపద్ధతి పట్టి బూటకమనిరి. లా-ఆర్డరు రక్షణనిమిత్తము, ప్రభుత్వమువారు కాంగ్రెసు కార్యక్రమము నణచివైచుటకు యావచ్ఛక్తిని వినియోగించెదరనిరి. బర్మా హిందూదేశమునుండి వేరుపడవలయు నన్ని, వీరు పట్టుదల జూపుచున్నారు. హిందూదేశము పరాధీనముగ నుండునంతవరకు, బర్మా హిందూదేశముతో కలసి యుండినను, వీరి కభ్యంతరములేదు. స్వపరిపాలనము ననుభవించు హిందూదేశముతో మాత్రము బర్మా కెట్టిసంబంధముండగూడదట. బర్మా హిందూదేశమునుండి విడిపోయినపిమ్మట, స్వపరిపాలనము బడయుట సులభసాధ్యముగాదు. హిందూదేశముతో గలసి యాందోళన సలుపుటకు వీలుండదు. బర్మాను హిందూదేశమునుండి విడదీసినపిమ్మట, దానిని ఎంతకాలమయినను పరాధీనస్థితిలో నుంచవీలగును. హిందూదేశమునందలి రాజకీయాందోళనతో బర్మా సంబంధము పెట్టుకొనవలదన్ని, గవర్నరుగారు హితోపదేశము గావించిరి. మిగిలిన రాష్ట్రపాలకులు గూడ బర్మా గవర్నరుగారి మార్గము నవలంబించిన వింత యుండదు. బర్మాగవర్నరుగారి ఎచ్చరిక ఎటులున్నను బర్మాశాసనసభ్యు లగు తయాబ్జీగారు కాంగ్రెసు ఆజ్ఞ ననుసరించి, తమ పదవికి రాజీనామా నిచ్చిరి. బర్మాగూడ, ప్రస్తుతసందిగ్ధసమయమున హిందూదేశముతో చేతుల గలిపి పాటుబడు నని నమ్మెదము.

పండిత మోతీలాల్ నెహ్రూగారు లాహోరు కాంగ్రెసు తీర్మానములగూర్చి యీసమయమున గావించిన ప్రకటనము భారతీయుల కర్తవ్యమును తేటపరచుచున్నది. ప్రజాశక్తులనన్నిటిని కేంద్రీకృతముగావింపవలయునన్ని, నెహ్రూగారు కోరుచున్నారు. విమర్శనములకును, వాదప్రతివాదములకును ఇది సమయము గాదనియు, ఆచరణయే ముఖ్యమనియు, కాంగ్రెసువర్కింగుకమిటీవారి ఉత్తరువుల నమలులో బెట్టుటయే ప్రతికాంగ్రెసుసభ్యుని విధి యనియు, రాబోవు పూర్ణస్వరాజ్య ప్రకటనోత్సవమును దేశమందంతటను జయప్రదముగ జరిపి, ప్రజలనిశ్చయమును వెల్లడి జేయవలయు ననియు, పండిత మోతీలాల్ నెహ్రూగారు దెలుపుటయగాక గాంధిమహాత్ముని యాదేశము ననుసరించి భారతీయులు కృతకృత్యులుగావలయు నని గూడ, ఎచ్చరించిరి. వంగదేశమునకు వీరు గావించిన ఎచ్చరిక సఫలమగు నని నమ్మవచ్చును. స్వాతంత్ర్యోద్యమమును నిర్వహించుటయందు వంగదేశ మెన్నడును వెనుదీసి ఎరుగదు. కలకత్తా కాంగ్రెసుసభలో గావించిన తీర్మానములనే, లాహోరు కాంగ్రెసు సభ సఫలపరచెను. అట్టి లాహోరు తీర్మానములను మరల వంగదేశము సఫలపరుపవలయు నని, నెహ్రూగారు గోరిరి. వంగదేశమునందు ముప్పదిమంది కాంగ్రెసుశాసనసభ్యుల రాజీనామాలు గెజెట్టులో ప్రకటింపబడెను. మిగిలినవా రందరుగూడ రాజీనామా నిచ్చెద రనుటకు సందియములేదు. మధ్యరాష్ట్రములును వంగదేశము ననుసరించుచున్నవి. దాదాపు కాంగ్రెసు సభ్యులందరును అక్కడ రాజీనామా నిచ్చిరి. బీహారునందు పదునల్గురు కాంగ్రెసుసభ్యులు రాజీనామా నిచ్చిరి. పంజాబు, సంయుక్తరాష్ట్రములు, తమ ధర్మమును నెరవేర్చుచున్నవి. మద్రాసు రాజధాని గూడ తన ధర్మమును జయప్రదముగ నిర్వహించు నని నమ్మవచ్చును. నిర్బంధపు కేకలు, భారతీయులలో స్వాతంత్ర్యసంపాదనా శక్తిని బలపరుపక మానవు. నిర్బంధములను పురికొల్పుచున్నవా రీసమయమున, స్వాతంత్ర్యోద్యమమునకు పరోక్షముగ సాయపడుచున్నా రని చెప్పవచ్చును. ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులు గారు, నిర్బంధగర్జనముగూర్చి తమ యభిప్రాయమును ప్రకటించుచు, ఇట్టికేకలు హిందూదేశమునంతను ఏకము గావించునన్ని, చాటిరి. కాంగ్రెసు నిర్ణయములను శిరసావహించి పనిజేయుటకు కాంగ్రెసుసభ్యుల నీకేకలు పురికొల్పకమానవు. ప్రకాశం పంతులుగారు నుడివినటుల, అంతరంగికభేదాభిప్రాయము లెన్ని యున్నను ఈ సమయమున దేశస్వేచ్ఛకై పాటుబడని భారతీయు లుండబోరు. గాంధి మహాత్ముని, పండిత జవహరిలాల్ నెహ్రూగారిని, విఠలభాయిపటేలుగారి సలహా ననుసరించి నిర్బంధించుటకన్నను, హిందూదేశమును కోల్పోవుటకు ఇంగ్లండుకు సులభమార్గ ముండ దన్ని, ప్రకాశంపంతులుగారు దెలిపిన యభిప్రాయము, సత్యమునే చాటుచున్నది. లాహోరు కాంగ్రెసు తీర్మానములను గౌరవించి, వాని ననుసరించుటకంటె, భారతీయులకును, అందు ముఖ్యముగ కాంగ్రెసు సభ్యులకును ప్రస్తుతసమయమున వేరుకర్తవ్య ముండజాలదు. భారతదేశము తన కర్తవ్యమును జయప్రదముగ నిర్వహించు గాక!

## అస్పృశ్యతానివారకసంఘము

కాంగ్రెసు శాఖ యగు అస్పృశ్యతానివారకసంఘమువారు 1929 సంవత్సరపు ఏప్రిలునెల మొదలు డిశెంబరువరకు సలిపిన కృషిని వివరించుచు, ప్రచురింపబడిన నివేదిక మిగుల ప్రోత్సాహకరముగ నున్నది. ఈ రీతిరుననే ఈసంవత్సరముగూడ పాటుబడుచో, అస్పృశ్యత త్వరలో సంతరించు ననుటకు సందియములేదు. ఈసంఘము .నేర్పరచుటకు, అస్పృశ్యు లనబడువారికి, చెరువులు, బావులు, పాఠశాలలు, దేవాలయములు ఉపయోగపడునటుల జేసి, వారి ఆరోగ్య పరిస్థితులను కాపాడుటయే ముఖ్యోద్దేశ్యము. జమ్నాలాల్ బజాజ్, పండిత మదనమోహన మాళవ్యాగార్లు గల యొకకమిటీ ఏర్పరుపబడెను. మాళవ్యాగారు, బొంబాయి, మద్రాసు రాష్ట్రములలో పర్యటనమును సలిపి, అస్పృశ్యతానివారణావశ్యకతను ప్రజలకు సుబోధకము గావించిరి. బాంద్రా, బొంబాయి, పూనా సమావేశములలో నిందు కనుకూలించిన తీర్మానములు గావింపబడెను. ఇందునిమిత్తమై పలుకుబడిగల ప్రచారకులు నియమింపబడిరి. కార్యదర్శి యగు బజాజ్ గారు వివిధరాష్ట్రములలో పర్యటనము సలిపి:

ఉన్నతజాతులవారితో సంప్రతించి, దేవాలయముల, బావుల ధర్మకర్తలతో యోచించి, అస్పృశ్యుల యిబ్బందులను తీర్చుటకు ప్రశంసాపాత్రములుగ కృషిసల్పిరి. కరపత్రములు ప్రచురింపబడి, విరివిగ పంచిపెట్టబడెను. వీరి ప్రోత్సాహమునకు ఫలముగ, ఇరువదియొక్క దేవాలయములలో అస్పృశ్యులకు ప్రవేశ మొసగబడెను. పెక్కు బావులు వీరి యుపయోగమునిమిత్త మొసగబడెను. కాని, నిమ్నజాతులవారు, దేశమున జరుగుచున్న యుద్యమమును సహింపక, కొన్ని బావుల సత్యాగ్రహమునకు బూనిరి. కాని, ప్రజాప్రబోధముపట్ల నిండువిశ్వాసము గల అస్పృశ్యతానివారకసంఘము వారు తీవ్రపద్ధతి యగుసత్యాగ్రహము నామోదింపరయిరి. బజాజుగారును దీని నవలంబింపవలదని యెచ్చరించిరి. అయినను చిరకాలపు ఇబ్బందులవలన పరితపించెడి నిమ్నజాతులు, ఓరిమిని కోల్పోవుచో, నాశ్చర్య ముండదు. వీరియందు ఆశను పురికొల్పు బాధ్యత ఉన్నతజాతులవారిపై నిలిచి యున్నది. అస్పృశ్యతానివారక సంఘమువారు సలుపుచున్న ప్రయత్నములు, నిమ్నజాతులవారిలో ఆశను పురికొల్పి, సత్వరాభివృద్ధికి తోడ్పడునని నమ్మెదము. జయకరుగారిందునిమిత్తము సలుపుచున్న కృషిని, అస్పృశ్యతా నివారక సంఘమువారు శ్లాఘించిరి. అస్పృశ్యతా నివారణము నిమిత్తము జయకరుగారొక చట్టమును గూడ భారతశాసనసభలో ప్రవేశపెట్టనున్నారు. బజాజ్‌గారు పర్యటనము సలుపుచున్నపుడు, స్వామీ ఆనందగారు కేంద్రకార్యాలయ వ్యవహారములను నిర్వహించిరి. గంగాధరరావు దేశపాండిగారు బీరారు, బొంబాయి, మహారాష్ట్రములలో ప్రచారము సలిపి, దేవాలయ ప్రవేశము విషయమున ధర్మకర్తలు ఉపురసమ్మతి బడసిరి. నూతనసంవత్సరమున నిర్మాణకార్యక్రమము చురుకుగ జరుగవలసి యుండుటచేత, అస్పృశ్యతానివారణకార్యక్రమము త్వరితముగ నభివృద్ధిగాంచునని నమ్మవచ్చును. పండిత మాళవ్యాగారీసంఘమున కధ్యక్షులుగ నుండ నంగీకరించుటచే, వీరి పలుకుబడియు, బజాజ్‌గారి కార్యచతురతయు, సత్వరకార్యాభీష్టసిద్ధికి తోడ్పడక మానవు. కాంగ్రెసుసభ్యులే గాక, యీ సంఘమునకు అన్నిపక్షములవారును, అన్నిసంఘములవారును తోడ్పడుట న్యాయము. ఇయ్యది కేవల రాజకీయ సమస్యగాని, కేవల సాంఘికసమస్య గాని గాదు. ఇది ముఖ్యముగ భూతదయకు సంబంధించిన ప్రశ్నయగుటచే, భూతదయకు పేర్వహించిన, హిందువు లెల్లరును ఇక్కార్యమునకు తోడ్పడుట యవసరము. హిందూసంఘము నావరించిన కళంకమును సాధ్యమగునంత త్వరలో దొలగించుట ముఖ్యావశ్యకము. రాజకీయ, సాంఘిక, ఆర్థిక, మత సంస్కర్తలెల్లరును, అస్పృశ్యతానివారణకు బూనుచో, జయము గాంచకుందురా ? గాంధిమహాత్ముడు దెలిపినటుల, అస్పృశ్యత కిదివరకే పాదు గదలినది. చిరకాల మిది నిలుచుట యసంభవము. దేశకాలపరిస్థితు లిందు కనుకూలముగ లేవు. అస్పృశ్యతను సమర్థించువా రరుదుగ నున్నారు. వివిధమతసంఘములును దీనిని నివారించుటకు బూనుకొనుచున్నవి. రాజకీయపక్షములన్నియు, దీని యావశ్యకతను గుర్తించుచున్నవి. వివిధ శాఖా స్వాతంత్ర్యమునకిది యత్యవసరమని, దేశము గుర్తించుచున్నది. అస్పృశ్యతానివారణము ఫలించుట కెంత కాలమో పట్టదని, పరిస్థితులు తెలుపకనే తెలుపుచున్నవి. గాంధి మహాత్ముని రాజకీయాభిప్రాయములతో నేకీభవింపనివారు గూడ, ఈ విషయమై వారు చేసిన మహోపకారమును గుర్తించుచున్నారు. మహాత్ముని సేవాలాభమును యిప్పటివారికన్నను భావిసంతతివారె క్కువగ కొనియాడక మానరు.

లాయడుజార్జిగారి పతనము

బ్రిటీషు లిబరలు పక్ష మిదివరకే నామమాత్రమయినది. ఇంగ్లండు కీపక్షముతో పని దీరినది. కొన్ని సంవత్సరములక్రింద ఏర్పడిన చీలిక వెనుకటి ఎన్నికలలో తొలగెనని ప్రకటింపబడెను గాని, గ్రే ప్రభువుగారిటీవల నిచ్చిన యుపన్యాసమును గాంచిన, ఇది అసత్యమని తేలుచున్నది. గ్రేప్రభువుగారు, కీర్తిశేషులగు ఆస్క్విత్తుగారి అనుచరులు. ఆస్క్విత్తుగారికిని, లాయడు జార్జిగారికిని తీవ్రభేదము లుదయించినపుడు, గ్రే ప్రభువుగారు ఆస్క్విత్తుగారిపక్షమునే వహించిరి. ఇప్పటికిని వీరు లాయడు జార్జిగారిపట్ల సుముఖులుగ లేరు. లాయడు జార్జిగారిని తా మనుసరింపజాల మని, వీరు నుడివిరి. లాయడు జార్జిగారు తమ నాయకత్వమును నిలుపుకొనుటకు పడినపాట్లను వీరు నిరసించిరి. లిబరలుపక్ష ద్రవ్యము, లాయడు జార్జిగారి స్వంతనిధియందే చేరియుండెను. అంతియగాని, దీనికి ప్రత్యేకధనము నొసగరయిరి. లిబరలుపక్షమును లాయడుజార్జిగారు తమచేతులలో కీలుబొమ్మ నాడించినటుల నాడింపవలె నని ప్రయత్నించిరి. కాని గ్రేప్రభువుగారిట్టి తంత్రములను నిరసించుచున్నారు. లిబరలు పక్షమునందలి రెండుభాగములవారును లాయడుజార్జిగారి నాయకత్వము నామోదించి రనుట సర్వాబద్ధమని, గ్రేప్రభువుగారు చాటుచున్నారు. ప్రత్యేకపక్షము నేర్పరచి, లాయడుజార్జిగారి నాయకత్వమును తొలగింప నవసరము గలదని, వీరు భావించుచున్నారు. లాయడుజార్జిగారికి లిబరలుపక్షపు నాయకత్వము తొలగుచో, వారొకరే నాయకులును వారొకరే యనుచరులుగ నుందురు. లాయడుజార్జిగారి పతనమునకు చింతించువా రుండరు. స్వాతిశయస్వార్థపరత్వములవలననే, వారట్టియధోగతికి వచ్చిరనుటకు సందియములేదు.

అహింసావశ్యకత

తీవ్రనిర్బంధములు దేశము నెదుర్కొనచున్న సమయమున, భారతీయులు సహనమును కోల్పోవక, అహింసను నిష్కర్షగ నవలంబించుట యవసరమగుచున్నది. ఈ సమయమున, ఏకారణముచే నయినను దేశము దౌర్జన్యమునకు బూనుచో, పూర్ణస్వరాజ్యోద్యమమునకు తీరనినష్టము వాటిల్లగలదు. ఉద్యమశ్రేష్ఠతకు భంగము వాటిల్లక మానదు. మహాత్ముని నాయకత్వమును దేశము కోల్పోవుట తటస్థించును. హిందూదేశము సత్య అహింసావ్రతము ననుష్ఠించి, స్వాతంత్ర్యమును బడయగల్గుచో, లోకకళ్యాణమున కత్యంతముగ తోడ్పడగలదు. ప్రపంచశాంతిరక్షణకును, యుద్ధబహిష్కారవిజయమునకును భారతదేశమే ప్రపంచమునకు మార్గము జూపి, గురుపీఠ మలంకరింపగలదు. ఇట్టి యమూల్యావకాశమును దేశము విడనాడదనియు, కతిపయులీ సమయమున పలుకుచున్న విపరీతప్రబోధ్యములు విఫల మగు ననియు నమ్మెదము.

పటేలుగారి విజయము

బార్డోలీలో సర్దారు వల్లభాయి పటేలుగారు పొందిన విజయము సుప్రసిద్ధమే. వీరి విజయమే, కృష్ణా, గోదావరి రీసెటిల్‌మెంటు సమస్యాపరిష్కారమునకు పరోక్షముగ తోడ్పడెననుటకు సందియము లేదు. కెయిరాజిల్లాలో ఎచ్చుపన్నులబాధనుండి ప్రజలను తప్పించుటకు, పటేలుగారు ప్రయత్నముల గావించుచున్నారు. వీరిప్రయత్నముల ఫలముగ కెయిరా మండలములో తలపెట్టిన ఎచ్చుపన్నులను కలెక్టరుగారు తగ్గింప నిశ్చయించిరని తెలియుచున్నది. పటేలుగారి కిది మరియొక విజయముగా భావింపబడుచున్నది. పటేలు బోలు కార్యదక్షులు కాంగ్రెసు వర్కింగు సంఘములో నుండగ, కాంగ్రెసు తీర్మానములు సఫలమగుట కాటంక ముండజాలదు.

## కెయిరాలో సుంకనిరాకరణము

భూమిశిస్తును ముజరాయియ్యవలెనని దొరతనము వా రాజ్ఞాపించుట

ఘూర్జరరాష్ట్రమున కెయిరా మండలమున మత్తార మహమదాబాదు తాలూకాలలో సుంకములను నిరాకరించు సర్దారు వల్లభాయి పటేలుగారు తీవ్ర ప్రస్తావ మొనరించుచున్నారు. వరుసగా మూడేండ్లనుండి యీ రెండు తాలూకాలలోను వరదలు, మంచు, అనావృష్టి మున్నగువానివలన పంటలు పండుటలేదు.

"మహమదాబాదు తాలూకాలో 6 గ్రామములలో పంటలు కొనున్నవిగాన అచట సిస్తు పూర్తిగానే వసూలుచేయబడును. 34 గ్రామములలో అర్ధపంట పండినవిగాను సగము సిస్తు వసూలు చేయబడును. 7 గ్రామములలో పంటలు పూర్తిగా పోయినందున అచట సిస్తు పూర్తిగా ముజరాయియ్యబడును" అని కెయిరాజిల్లా కలెక్టరు ప్రకటించెను. మత్తారు తాలూకాను గూర్చి గూడ నిట్టి ప్రకటనమే త్వరలో చేయబడునని తెలియుచున్నది. సర్దారు వల్లభాయిగారు సుంకనిరాకరణమునకు పూనుకొనుటవలననే రైతుల కీసదుపాయము జరిగినదనుట కెట్టి సంశయమును లేదు" అని బొంబాయినుండి నిన్న వొక విశేషతంతివార్త వంపెను.

## జాతీయ శాసనసభ్యుల సమావేశము

ప్రభుత్వమును ప్రతిఘటించుటకు బలీయమగు పార్టీని స్థాపించుటకు జరుగును

ఢిల్లీ, జనవరి 15:—డాక్టరు మూంజీ, పండిత మదనమోహన మాలవ్యాగారలు సమావేశపరచు జాతీయ శాసనసభ్యుల సభ వెస్టరన్ హోటలులో జనవరి 18 తారీఖు 3 గంటలకు జరుగును. కాంగ్రెసు పక్షమున ఎన్నికొనబడని శాసనసభ్యులు, శాసనసభా బహిష్కారము నొప్పుకొనని కాంగ్రెసు సభ్యులు, శాసనసభలలో సభ్యులుకాని యితర జాతీయనాయకులు సభకు వత్తురు. (ఫ్రీ ప్రె.)

(పూర్వపు తంతివార్త)

పత్రికలలో ప్రకటన గావించుచు జనవరి 18 తారీఖున జరుగు జాతీయవాదుల సభ ప్రభుత్వము వారిని ప్రతిఘటించుటకు క్రొత్తపార్టీ నేర్పరచుటకు జరుగునని మూంజీగారు తెలుపుచున్నారు. కావున యిప్పుడు జరుగు బై ఎలెక్షనులలో త్వరపడి పనికిమాలినవారిని ఎన్నుకొనకూడదని వారు ఎన్నికదారులను హెచ్చరించుచున్నారు. కాంగ్రెస్‌వారు స్వార్థమునువదలి చేసినపనిని వారు ప్రశంసించుచు యీ సమయమున నెవ్వరు ఎక్కువ దేశభక్తుడు ఎవ్వరు తక్కువ దేశభక్తుడు అను వాదములను మాని తమ గమ్యస్థానమును చేరుట కందరును కృషిసలుపవలెనని వారు కోరుచున్నారు. కాంగ్రెస్‌వారి పద్ధతివలన తమకును కొంత ఉత్సాహము కలుగునని వారు చెప్పిరి. (అ. ప్రెస్.)

# శ్రీ ఏలూరు, జనార్దన వాసవకన్యకాపరమేశ్వరీ అన్నసత్ర చలివేంద్రల ప్రథమ సాంవత్సరికమహోత్సవము

మద్ది వెంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారి అధ్యక్షత క్రింద జరిగెను.

శ్రీ హేలాపురంబున వర్తకశిఖామణులచే 1846 సంవత్సరమున ప్రారంభింపబడి నేటివరకు అవిచ్ఛిన్నపరంపరగా దినదినాభివృద్ధిలో జరుపబడుచున్న ధర్మకార్యముల వివరము.

మూసాఫరీ సత్రం.

| నిరతాన్నదానం. | అన్నసత్రం. | మంచినీళ్ల చలివేంద్ర |
|---|---|---|
| ప్రారంభము. 1846 | ప్రా. 1848 | ప్రా. 1871. |
| ఇప్పటికి 84 సం॥లు | ఇ. 82 సం॥లు | ఇ. 59 సం॥లు |

| శ్రీ నగరేశ్వరస్వామి శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరి అమ్మవారు శ్రీ గణపతి దేవాలయములు ప్రతిష్ఠ. | శ్రీ జనార్దనస్వామివారి ఆలయము కట్టుట ప్రారంభము. 1892. ఆగిపోయినది. 19సం॥ శ్రీ రాజ్యలక్ష్మీ తాయారు శ్రీ ఆండాళ్ తాయార్ల ఆలయములు సహా ప్రతిష్ఠ. |
|---|---|
| ప్రారంభము. 1872 | ప్రా. 1911 |
| ఇప్పటికి 58 సం॥లు. | ఇ. 19 సం॥లు. |

ఈ ధర్మకార్యములు వృద్ధి అయినకొలది మామూళ్లు ఎక్కువచేసి దఫదఫాలు ధర్మశాసనములు పట్టాలు వ్రాయించుచుండిరి.

ఇప్పటికి షుమారు 85 సంవత్సరములు పదునాలుగులోపు గానున్న వర్తకయువకులకు మనపూర్వులును, మనమును జరిగించిన యీధర్మకార్యముల సంపర్కములు విశదపరచగలందులకు నాకు కుతూహలముగలిగి యీ రిపోర్టును సమర్పించుకొనుచున్నాను.

నిరతాన్నదానము జరుపుచూ మిగిలిన ద్రవ్యముచే అన్నసత్రమును యింకా మిగిలినద్రవ్యముచే కొంతకాలమునకు మూసాఫరిసత్రమును మంచినీళ్ళ చలివేంద్రమును యింకా మిగిలినద్రవ్యముచే మరికొంతకాలమునకు శ్రీ నగరేశ్వరస్వామి శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ అమ్మవారు, శ్రీ గణపతిదేవాలయమును కట్టించి ప్రతిష్ఠలు జరిగించినారు. మరికొంతకాలమునకు శ్రీ జనార్దనస్వామివారి కోవెల కట్టించుటకు 1892వ సంవత్సరమున ప్రారంభించినారు. ద్రవ్యలోపముచేత 19 సంవత్సరములు ఆగిపోయినది.

1911 సం॥ సప్తగ్రహకూటమి వచ్చినది. అప్పుడు గ్రామశాంతికొరకు జపములు హోమములు బ్రాహ్మణ సమారాధనములు జరిపించవలెనని పండితులు సెలవుయివ్వడమువలన మాకు కుతూహలము కలిగి:—

మహారాజశ్రీలు

(1) మానేపల్లి రాజన్నగారి కుమారుడు గంగరాజుగారు.
(2) కచిగోళ్ళ జగన్నాథంగారు.
(3) బూరిశెట్టి కొండయ్యగారు.
(4) చుందూరి శాస్త్రిలుగారు.
(5) కొందూరి సుబ్బయ్యగారు.
(6) పయిడేటి కంచయ్యగారు.
(7) మానేపల్లి సూర్యనారాయణగారు

కలిసి సంతర్పణలు వగయిరా అమ్మవారిసత్రములో జరిపించుచు నుండగా శ్రీ జనార్దనస్వామివారి ఆలయమును గాంచి పరిస్థితులు తెలుసుకొన్నాము గాని—

అప్పటినుండి శ్రీ జనార్దనస్వామివారి ప్రతిష్ఠ చేయించి తీరవలెనని మాకు అందరికి సంకల్పము కలిగినది. అయితే అంత సామర్థ్యములేమిచే ప్రజలకు ప్రబోధకలుగుటకు బ్రహ్మశ్రీ కలవలపల్లి రంగనాథశాస్త్రిలవారిచే పురాణకాలక్షేపము చేయించుచు శ్రీ కాశీయాత్రచేసిన మహారాజశ్రీ ధర్మదాత మోతే గంగరాజు జమీందారుగారి రాకకు నిరీక్షించి, వారు దయచేయగానే యీ ప్రతిష్ఠ చేయించుపని మీవల్ల కావలయును అని ప్రార్థించితిమి—జమీందారు దాన చింతామణిమూర్తి యగు జమీందారే. అప్పటికి ప్రాకృతము చేయించవలెనని అనుకొన్నది మాని జమీందారుగారు వర్తకసంఘములను సమావేశపరచి దివ్యస్థలము చేయించుటకు ప్రోత్సాహపరచినారు.

అందరికి ఆనందమైనది. పని ప్రారంభించినాము. మా స్వంత ద్రవ్యముతో కోవెలవద్ద వంటలు చేయించుకొని 8 మాసములు పని చూచితిమి.

| | |
|---|---|
| అప్పటికి నిల్వసొమ్ము | రు 6000—0—0 |
| కావలసినది | రు 80,000—0—0 |

శ్రీ రాజ్యలక్ష్మీతాయారు శ్రీ ఆండాళ్ తాయార్లు సన్నిధులును, కోతాయిన గయిరాలకు కావలసిన స్థలములు సంపాదించి దివ్యదేశము చేయించినారు. ఆయన సాహసమును చూడండి. మేము ప్రవేశించక మునుపు ఉన్న రు 6000-0-0 అట్లాగే నిల్వవుంచి యీ కార్యములను వర్తకసంఘము యొక్క ప్రభావము భక్తిశ్రద్ధలచే జరిపించెను.

జమీందారుగారు ధర్మకర్తృత్వ బాధ్యత వహించినది మొదలు వర్తకసంఘమును యేకతాటిమీద నడిపించి ఆ మహామహావుడు కైంకర్యములను జరిపించుచు యేలోటుగాకుండా మహారాజశ్రీ ధర్మదాత కొనకళ్ళ శేషయ్యగారు శ్రీరంగనాయకస్వామివారి కైంకర్యములకు మూలధనము నిమిత్తం సమర్పించిన రు 11000 పదకొండువేల రూపాయీలుసహా 60 అరవయి యకరముల భూవసతి సంపాదించిరి.

ఏది యెట్లుండినను దివ్యస్థలము అగుటచే యెట్లు జరుగునాయని పరితపించుచుండగా శ్రీజనార్దనస్వామివారి జననముతో ఏలూరులో జాటుమిల్లు బియ్యపుమిల్లులు జననమై యేలోటురాకుండా అవిచ్ఛిన్నముగా కైంకర్యములు జరుగుచున్నవి.

కాని ప్రథమములో 5 గురు మెంబర్లు మాత్రం శ్రద్ధతో పని జరుపుచుండిరి. దివ్యస్థలము అయిన తరువాత కొద్దిమంది మెంబరులతో పరిపాలన జరుగుట చాలాకష్టతరము అని దూర్గముదొరకక నాకు రాత్రింబవళ్ళు నిద్రపట్టలేదు.

ఒకనాటి రాత్రి 1 గంటకు 30 ముప్పదిమంది మెంబర్లు అయితే సమగ్రముగా పనిజరుగునుండని తోచినది. తక్షణం యీధర్మకార్యములు శ్రద్ధగా చూడగలరని తోచినవారిని జాబితావ్రాసి కమిటీవారికి చూపించి సంప్రతించి జాబితా ధర్మకర్తగారికి సమర్పించుకొనుటకు అంగీకరించిరి. ఆదేవిధముగా ఇప్పటివరకు 30 మంది మెంబర్లతో పరిపాలించుచుండిరి.

అధ్యక్షులగు మద్ది వెంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు

కాని యింకా భయము వదలలేదు. కమిటీమెంబర్లు ఎవరూ అవిమయములో శ్రద్ధచేయక స్థిరాస్థులవల్ల వచ్చు ద్రవ్యము కూడా కైంకర్యముల కుపయోగపరచుటవల్ల యీ ధర్మకార్యములవేరుతో గొప్ప గొప్ప ధర్మములు చేయకపోవుటచేత ఆక్షేపణీయముగా నున్నది.

ఈ స్థితిగా మనము యెంతకాలము పరిపాలనచేసినా ఆక్షేపణ నిలిచియుండును.

మూలధనము అవసరం ఏమి? వర్తకమామూళ్ళవల్ల వచ్చు ద్రవ్యముతో యేలోటు లేకుండ కైంకర్యములు జరుపవచ్చును.

స్థిరాస్తులవల్ల ప్రతి సంవత్సరము వచ్చు షుమారు 4000-0-0 నాలుగువేల రూపాయీలున్నూ 31 సంవత్సరముల వరకు మూలధనముగా పెంచుతూ యెప్పటికప్పుడు స్థిరాస్తులు కొనుచూ వృద్ధిచేసినయెడల రు 3, 50, 000. ఆ మూడు లక్షల యేబయివేల రూపాయీల స్థిరాస్తులు ఏర్పడి - సం॥ 1 కి షుమారు రు 25000-0-0 రాబడి రాగలదు. కనుక యిప్పటి కాలుఱు మూలధనముతోపాటు యెదిగి యీ ధర్మకార్యములే గాక యింకా గొప్ప గొప్ప కార్యములు చేసి మనకు ప్రతిష్ఠ తేగలరు

31 సంవత్సరముల నీమము యెందుకని మీరు అభిప్రాయపడవచ్చును.

30 మంది మెంబర్లు 30 సం॥ లను ధర్మకర్తగారు 1 సం॥ యీ ద్రవ్యమును పెంచుటకు జనరల్ మీటింగుచేసి ఏర్పరచినందుకును, యీ కార్యములు 31 మెంబర్లతో పరిపాలన చేయుచున్నట్లు మన కాలుఱు సంతోషించగలందులకు నాప్రకారము ఏర్పరచుడ మయినది.

శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరి అమ్మవారిసత్రిం నికర్తు అయి పలువురు బాటసారులచే ఆక్షేపణీయముగా నున్నదని 20 సంవత్సరములు క్రితమే నేను గ్రహించితిని. అప్పటినుంచి కోవెల లగాయితు అమ్మవారి సత్రింవరకు మధ్యవున్న యిరుకుస్థలములు కొని అందరికిని సదుపాయములు కలుగజేసి మంచి ఏర్పాట్లతో, గ్రామమునకు ప్రతిష్ఠ వచ్చేలాగు కట్టించవలెనని సంకల్పించుకొంటిని. అప్పటి నుంచి అమరిన స్థలములు కమిటీవారితో సలహాచేసి సంపాదించితిని. మిగిలిన స్థలముల నిమిత్తం కమిటీవారి ప్రోత్సాహము చూచి సంపాదించవలెనని పట్టుదలతో నాద్రవ్యముతో కోవెలలో స్వామి ప్రసాదమును భుజించుచు 6 మాసములు కాలక్షేపము చేసి అమరినంతవరకు కొంటిని.

నేటికి భగవదనుగ్రహము చేతను, కమిటీమెంబర్ల అనుమతి చేతను, వర్తకసంఘములవారు అతియుత్సాహముతో సత్రం ద్రవ్యము వెంటనే యిచ్చుటచేతను, షుమారు 20,000-0-0 యిరువదివేల రూపాయీలు స్థలములు సంపాదించితిని.

మన అదృష్టవశముచే మ. రా. శ్రీ మద్దుల పేరయ్యగారి కోనేరు మరమ్మతు చేయుటయును, మనసత్రము వేదపాఠశాల తయారు చేయించుటయున్నూ పూర్తిఅయినచో యెట్లుండునో తెలిపెదను.

ఒక బాటసారి దిగెను అని అనుకొందాము.

(1) కోనేరులో స్నానసంధ్యాద్యనుష్ఠానములు
(2) పుష్పవన సంచారము
(3) దేవతాదర్శనం
(4) గో ప్రదక్షిణము
(5) సంస్కృతపాఠశాలా ప్రవేశం
(6) వేదపఠనశ్రవణం
(7) సత్రములో భోజనము
(8) కోవెలలో శాశ్వతముగా ప్రతిదినము సాయంత్రము గం. 6 లు లగాయతు 8 ఘంటలవరకు జరిగించబడే పురాణపఠన శ్రవణాదులు.

ఆ బాటసారి ఆనందమున్నూ మనకు కలిగే ప్రతిష్ఠయున్నూ సభవారు ఆలోచించెదరుగాక!

శ్రీవైష్ణవ, బ్రాహ్మణ, వైశ్యశూద్రులకు సత్రములు అనుకూలముగా కట్టించుటకున్నూ, వేదపాఠశాల, సంస్కృతపాఠశాలల ఏర్పరుచుకొనుటకును ఏక స్థలమున వరుసగా అమర్చుకొనుటకు స్థలములు అమరినందుకు భగవంతుని ప్రార్థించుచు ఆనందించెదరని తలంచుచున్నాను.

ఇన్ని సదుపాయము లొకచోట సిద్ధించుట మన అదృష్టముకదా! కట్టించవలెనన్న నొకకాసు అయినలేదు, యెట్లు కట్టించగలమో ఆలోచించవలసి వున్నది. భయములేదు. స్థిరప్రతిష్ఠలకు ఆశించి యున్నవారున్నారు. ద్రవ్యసహాయము చేయుదురు.

ఈ పత్రిము పనులు నిర్వహించుటకు 3 సంవత్సరములు పట్టును గనుక అప్పటివరకు మన వర్తకసంఘమువారు పేరు ప్రతిష్ఠలకు ఆశించి కొన్ని సదుపాయములు చేయవలసియున్నది. యేమనగా:-

ఇదివరకు ప్రతి సంవత్సరముకు యిచ్చుచున్న మామూళ్లు ప్రకారం సరిచూచి ఒకమొత్తంగా సంవత్సరమునకు ముందుగానే యిచ్చేయెడల ధర్మకర్తగారి తరపు మెంబరుగారును మామూలు వసూళ్ళ ప్రయాసపని తగ్గించుకొని మామూలు కైంకర్యములు జరిపించుచుండగా మనము అందరము లక్ష రూపాయల తో అతిసులభముగా సత్రములు కట్టించుపనియే చూచుకొని పూర్తిచేసి, మన పూర్వులు గడించిన గౌరవప్రతిష్ఠలను మన కీర్తిప్రతిష్ఠలు అని శిరసావహించి ఆనందింతుము గాక! యని ప్రార్థించుచున్నాను.

నే నిదివరకు శ్రీ జనార్దనస్వామివారికి కల్యాణ మంటపము కట్టించుటకు సంకల్పించుకొని ద్రవ్యము నిచ్చియున్నాను. స్థితిగతము చూచుకొని తగినంత శీఘ్రముగా పూర్తిచేసి భక్తజనానందకరముగా సమర్పించుకొందును.

కమిటీ మెంబరు,
మానేపల్లి సూర్యనారాయణ

## విషసందేశము

కలకత్తా, జనవరి 15:—"విషసందేశము" అను కరపత్రమున రాజద్రోహపూరితములగు భావములున్నవని బెంగాలు ప్రభుత్వమువారు ఆ కరపత్రములను నిషేధించిరి. (ఫ్రీ ప్రెస్)

## ఇంగ్లీషుధానలు ఈదుట - నైజాము విరాళము

సికంద్రాబాదు, జనవరి 15:—సాఫీ అహమదుగారు ఇంగ్లీషు ధానలు ఈదుటకై ప్రయత్నములు సలుపుచున్నారు. నైజాముగారు వీరికి 500 రూప్యములు విరాళ మొసగిరి.

(అ. ప్రె.)


CHEVROLET

